# చందమామ

ఈ సంచికలో: కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

చందమామ (అన్ని భాషలలో)
(విడి కాపీ 50 నయా పైసాలు. 8 అణాలు)
సాలు చందా రు. 6 లు.

నవశక్తి ఫిలిమ్స్

# కలిమి లేములు

దర్శకుడు: జి. రామినీడు
సంగీతం: అశ్వత్థామ
నిర్మాత: జయదేవి






హాయి, ఉత్సాహం, ఆరోగ్యవంతం... లైఫ్‌బాయ్
తో స్నానానంతరం మీరు వీటిని పొందు దురు.
క్రిములు అంటకుండా ఎవ్వరూ తప్పించుకోలేరు. మరి
మీరు లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానం చేయునప్పుడు
అది మురికిలోగల క్రిములను కడిగివేయును
గాను. లైఫ్‌బాయ్ వాడుటవల్ల... కుటుంబంలో
అందరి జీవితం ఆరోగ్యవంతం !

## ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో,

## అక్కడ ఆరోగ్యము వున్నది!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L.29-X29 TL.

తుషార్ వంటింట్లో వుంటే
ఇంట్లో అంతా ఆరోగ్యమే

తన కుటుంబంలోనివారి ఆరోగ్యం వారు తినే ఆహారం పై ఎక్కువగా ఆధారపడుతుందని వివేకి అయిన ప్రతి తల్లికి తెలుసు. వంట చేయుటకు సరైనది తుషార్ – ఏ, డి, విటమినులతో ప్రశిద్ధి కెక్కిన వనస్పతి అని కూడా ఆమెకు తెలుసు.






తుషార్
విటమినులుగల వనస్పతి
ఎ, డి, విటమినులు కలవు
తుంగభద్ర ఇండస్ట్రీస్ లి., కర్నూలు

ASP/TI.9

# పాఠకుల లేఖలు

## జూన్ 1962

మా "చందమామ" రాష్ట్రేతర ఆంధ్రులకు రామాయణ భారత ఇతిహాస కథలను గూర్చి తెలుసుకొనుటకు ఎంతయో ఉపయోగపడు చున్నది.

—కుమారి విజయలక్ష్మి, రీవా

"భూతాలు చేసిన పెళ్ళి" మరీ బాగుంది. తాతయ్య కథలు అత్యంత పసందు. గుండు భీమన్న ఇక రాడుకదా అని బెంగపడుతున్నాను.

—అబ్దుల్ బాధ్షా, గాంధీనగరం

"విధి నిర్ణయము", "అసత్యవాది", "యుక్తి పరుడు బీర్బల్" మొదలగు శీర్షికలు ఈ నెల "చందమామ"కు వన్నె తెచ్చినవి.

—డి. కృష్ణబ్రహ్మానందం, ప్రొద్దుటూరు

గుండు భీమన్న వెళ్ళిపోతూ తాతయ్య తిరిగి రావడం బావుంది.

—"సూరి", అరికెల

కథ లన్నియు ముచ్చటగా నున్నవి. ముఖ్యంగా "అసత్యవాది", "విధి నిర్ణయం" అమోఘం.

—పువ్వాడ వెంకటేశ్వర్లు, బాపట్ల

"గుండు భీమన్న చందమామ పాఠకుల వద్ద సెలవు పుచ్చుకుంటున్నాడు" అన్న వాక్యము చూచుట తోడనే నాకు కలిగిన విచారము చెప్ప నలవికాదు.

—చెన్నూరి కమలాకర్, పెద్దపల్లి

"భూతాలు చేసిన పెళ్లి", "పిశాచం వదిలింది", "విధి నిర్ణయం" ఎంతో బాగున్నాయి.

—వి. సాయినాథ్, నెల్లూరు

ఈనెల "చందమామ" చాల బాగుంది. తాతయ్య కథలు మొదలు పెట్టినందులకు చాల సంతోషం.

—బి. మహాలక్ష్మి, ఉయ్యూరు

ఉత్పల సత్యానారాయణాచార్యగారి "పార్వతీ కల్యాణం" గేయం చాలా బావుంది. ఆయనకు నా అభినందనలు.

—యేలేశ్వరపు సూర్యనారాయణశాస్త్రి, మొగల్తుర్రు

మేనెల "చందమామ" చాలా ఆకర్షణీయముగా వుంది. ఇందు "రాకాసిలోయ", యుక్తిపరుడు బీర్బల్", "అసత్యవాది" కథలు చాలా బాగున్నవి.

—వి. రామమోహన్, చిన్నమండెం

"విధి నిర్ణయం" [బేతాళ కథ] మేనెల "చందమామ"కు వజ్రాభరణం లాంటిది.

—టి. జయప్రకాశ్, నిజామాబాద్

ఈ సంచిక నుండి తాతయ్య కథలు ప్రచురిస్తున్నందుకు చాలా సంతోషము. "యుక్తి పరుడు బీర్బల్", "విధి నిర్ణయం" అద్భుతముగా నున్నవి. "రాకాసిలోయ" "చందమామ"కు వన్నె తెచ్చు చున్నది.

—సి. లలితకుమారి, కాశీబుగ్గ

"రాకాసిలోయ" చదువుతుంటే ఏదో తెలియరాని ఆనందం కలుగుతుందండి.

—జి. ఎల్. సర్సయ్య, కోవెలకుంట్ల

ఉత్పలవారి "పార్వతీ కళ్యాణము" బాల సాహిత్యమునకు మకుటాయమానమని నా నమ్మకము. "రాకాసిలోయ" "చందమామ"కు వన్నె దెచ్చినదనుట అతిశయోక్తి కాదు. "విధి నిర్ణయం"లోని కల్పన చందమామవారి నైపుణ్యమును తెలుపుచున్నది.

—నేరి శ్రీ కృష్ణమూర్తి, వారాసిగూడ




"ఏడాది పొడుగునా
నా **హెర్క్యులిస్** మీద
ఒక వారం బస్సు ఛార్జీకంటె
తక్కువగానే ఖర్చుపెట్టాను"

— అంటున్నాడు కృష్ణమూర్తి

అతను ఖర్చుపెట్టిన ఆ మూడున్నర రూపాయలు కూడా ప్రతి యేడూ మామూలుగా జరిగే ఓవర్ హాలింగ్ కోసమే!

ఈ రోజుల్లో తయారయ్యే సైకిళ్లలో హెర్క్యులెస్ అత్యుత్తమమైనది. ఇండియాలోనే చాలా పెద్దదీ, అన్నిహంగులూ కలిగిన కర్మాగారంలో ఇది తయారుచేయబడుతోంది. ఇందులోని ప్రతి భాగమూ ఖచ్చితంగాను సక్రమంగానూ వుంటుంది. అందువల్ల కొంచెం జాగ్రత్తలోనే హెర్క్యులెస్‌ను చాలాకాలం వాడుకోవచ్చు.

# హెర్క్యులిస్

సైకిల్ కంటె ఎక్కువైనది
అది మీ ప్రాణమిత్రుడు



నిర్మాతలు:
టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు - (మదరాసు)

JWT TIC/H 1582




'ఇట్టి కొంటె బాలుని చక్కగా పోషించాలంటే మీకు చేతినిండా పనివుండాలి ... అనగా అతనిని మీరు పరిశుభ్రంగాను, సొగసుగాను వుంచుటకు మళ్లీ మళ్లీ బట్టలుతుకుతుండాలి.'
ఇంకా నయం, సన్‌లైట్ నన్ను కాపాడుతున్నది. దాని సమృద్ధయిన నురగ అతని బట్టలను బాగా శుభ్రపరుస్తుంది, మళ్లీ మళ్లీ వుతుకుటలో ఏమాత్రము శ్రమలేదు. శుద్ధమైన సబ్బు లక్షణం అదే.

న్యూ ఢిల్లీ యందు లేగన్ సింగ్ మార్కెట్ రోగల ఫ్లైట్ 54 యందున్న శ్రీమతి. కమల వార్ష్ని ఇలా చెప్పుచున్నది, 'బట్టలుతుకుటకు సన్‌లైట్ వంటి సబ్బు మరేదీ లేదు.

# సన్‌లైట్




మీ బట్టలకు వరప్రసాదం!
హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.31-X29 TL




## చకచకా పెరగాలి...
## చురుకుగా తిరగాలి...

ఏడాదిలో ఎన్ని విద్యలు నేర్చుకోవాలనీ! పాకాలి దేకాలి అడుగుల్లా వెయ్యాలి. ఈలోగా – ఈ యేడాదిలోనే బరువు రెట్టింపు పెరగాలి. పాపాయి ఇన్ని పనులు సాధించి చక్కబెట్టాలంటే తలిదండ్రులు అడుగడుగునా ఆదుకోవాలి. అజీర్తిచేసి పాప ఆరోగ్యం దెబ్బతినకుండా చూడడం తలిదండ్రుల బాధ్యత.

ఇందుకు అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ అన్ని విధాలా తగినదని డాక్టర్లు చెబుతున్నారు. అది హాయిగా ఉంటుంది. చక్కగా పనిచేసి ఫలితాలు చూపిస్తుంది. పాలపళ్లు మొలిచే వేళల్లో పాపం కేమాత్రం బాధలేకుండా చూస్తుంది.

మీ పాపాయికి ప్రతి ఉదయం, అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ ఒక టీ స్పూను పాలి పట్టండి. పాప తన పనులన్నీ చకచక చక్కబెట్టుకు చక్కగా పెరిగి తిరుగుతుంది




# అమృతాంజనము
లిమిటెడ్‌వారి
# గ్రైప్ మిక్శ్చర్

తయారుచేయువారు : అమృతాంజన్ లిమిటెడ్ మద్రాసు-4 బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1

JWT/AM/G-1417




జె. బి.

# సాల్టో

బిస్కట్లు




రుచిగా, ఎల్లప్పుడూ కరకర లాడుతూ ఉండే జె. బి. సాల్టో బిస్కట్లు యిప్పుడు సొగసైన రంగులుగల 450 గ్రాముల డబ్బాలలో ప్యాకుచేయబడినవి. సాల్టో బిస్కట్లను తినండి మరియు డబ్బాలను యింట్లో వాడుకోండి!

**జె. బి. మంఘూరామ్ అండ్ కంపెనీ**

గ్వాలియర్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

తాతయ్య తిరిగి వచ్చినందుకు పాఠకులు సంతోషించారు కాని గుండు భీమన్న వెళ్ళి పోవటం గురించి చాలామంది బాధపడుతున్నారు. గుండు భీమన్న ఒక ఇంటివాడయాక ఇక అతన్ని మనం బాధించరాదు. అతనికి బదులుగా పరోపకారి పాపన్న వచ్చాడు. ఇతనిది మరొక రకం మనస్తత్వం. గుండు భీమన్నను చూసిన దృష్టితో పాపన్నను చూడవద్దు.

బీర్బల్ కథలుకూడా పాఠకులను ఆనంద పరిచినట్టు కనిపిస్తుంది. ఈ సంచికలో మరికొన్ని బీర్బల్ కథలు వేసి ఇంతటితో వీటిని ముగిస్తున్నాం.

ఏప్రిల్ సంచికలో స్థలం లేని కారణంచేత పాఠకుల లేఖలు ప్రచురించ లేదు.

సంపుటి : 30 జూన్ 1962 : సంచిక 6

CHITRA



# భారత చరిత్ర



సాతవాహనులకు సమకాలికులై వారికి ప్రతిగా నిలిచినవారు కళింగ రాజులు. అశోకుడి అనంతరమే వీరు గొప్ప సామ్రాజ్యం స్థాపించారు. కళింగ రాజులలో ప్రముఖుడు ఖారవేలుడు. ఈయన మగధను ఏలుతూ ఉండిన బృహస్పతి మిత్రుడనేవాణ్ణి జయించాడు. ఈయన తన సామ్రాజ్యాన్ని గోదావరి దాటి విస్తరింపజేశాడట. అయితే ఈయన అనంతరం కళింగ సామ్రాజ్యం అంతరించి పోయింది.

తమిళ (ద్రవిడ) దేశంలో చాలామంది రాజులుండేవారు. వారిలో ముఖ్యులు చోళ, పాండ్య, కేరళ దేశాలవారు. ఈ నాటి తంజావూరు, తిరుచిరాపల్లి జిల్లాలనూ, పరిసర ప్రాంతాన్నీ చోళులు పరిపాలించారు. క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దంలో చోళులు గొప్ప యుద్ధాలు చేశారు. ఏళరన్ అనే చోళరాజు సింహళాన్ని జయించాడు. ఇతని న్యాయబుద్ధిని నిరూపించే కథలు అనేకం చెబుతారు. ఈ నాటి మదుర, తిరునెల్వేలి, దక్షిణ తిరువాన్కూరు జిల్లాల ప్రాంతాన్ని పరిపాలించిన పాండ్యులు వర్తకాన్నీ, సంస్కృతినీ పెంపొందించారు. ఆగస్టస్ అనే రోమను చక్రవర్తి వద్దకు ఒక పాండ్యరాజు తన రాయబారిని పంపాడు. కేరళ రాజ్యం పాండ్యరాజ్యానికి ఉత్తరానా, పడమటా ఉండి, మలబారు, కొచిను, తూర్పు తిరువాన్కూరు ప్రాంతాలు చేరి వుండేది.

మౌర్య సామ్రాజ్యం విచ్ఛిత్తి అయినది మొదలు ఇండియాపై విదేశీయుల దండయాత్రలు సాగాయి. బాక్ట్రియాను ఏలే డిమిట్రియోస్ అనే యవనరాజు అఫ్గనిస్థానం, పంజాబు, సింధు దేశాలలో హెచ్చుభాగం జయించి పరిపాలించాడు. పంజాబులోని శాకల అనేది రాజధానిగా పెట్టుకుని మరొక యవనరాజూ, గాంధారంలో తక్షశిల

## 9. విదేశీయుల దాడులు

రాజధానిగా వేరొక యవనరాజు పాలించారు. అయితే కాలక్రమాన ఈ యవన రాజులు తమ పరిసరాల ప్రభావానికి గురి అయి బౌద్ధమతమూ, వైష్ణవమూ పుచ్చుకున్నారు. క్రీ. శ. మొదటి శతాబ్దంలో భారత దేశంలో యవనుల ప్రభావం పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది.

యవనుల (గ్రీకుల)తో పోటీ చేసి వారి స్థానాన్ని ఆక్రమించిన విదేశీయులు శకులూ, పహ్లవులూ, కుషానులు. శకులు మధ్య ఆసియావారు. అక్కడి నుండి కుషానుల చేత తరమబడి దక్షిణంగా వలస వచ్చారు. వారు క్రీస్తు శకారంభంలో ఆఫ్గనిస్థానం దక్షిణ ప్రాంతంలో స్థిరపడి శకస్థానం అనేది ఏర్పాటు చేసుకున్నారు. క్రమంగా వారి పరిపాలన సింధు లోయకూ, పశ్చిమ భారతానికీ వ్యాపించింది.

క్రీ. శ. మొదటి శతాబ్దంలోనే శకుల సామ్రాజ్యంలో కొంత భాగాన్ని పహ్లవులు ఆక్రమించారు. అటుపిమ్మట భారతదేశంలో శక-పహ్లవ పరిపాలన కొంతకాలంసాగింది. వీరి తరఫున క్షత్రపులూ, మహాక్షత్రపులూ అనే గవర్నర్లు వేరువేరు ప్రాంతాలను పాలించారు. ఒక దశలో సాతవాహన సామ్రాజ్యంలో కొంత భాగం ఓడించి చివ



రకు గౌతమీపుత్ర శాతకర్ణి చేతిలో ఓడిపోయినది ఈ క్షత్రపులే. శకరాజులలో ప్రముఖుడు రుద్రదామనుడనేవాడు. ఇతను క్రీ. శ. 130-150 మధ్య కాలంలో పరిపాలించాడు. ఇతని పరిపాలన కొంకణ ప్రాంతం నుంచి ఉత్తరాన సింధు, మార్వారు దేశాలదాకా వ్యాపించిందట.

యు ఎ-చి అనే సంచార ముఠాలవారు క్రీ. పూ. 165 ప్రాంతంలో చీనా సరిహద్దు నుంచి తరుమబడి ఆక్సస్ లోయలో అయిదు రాజ్యాలు ఏర్పాటు చేసుకున్నారు. వీరిలో కుషానులనే వారికి రాజైన కుజులకుస అనేవాడు శక్తిమంతుడై ఒక

సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఇతను పహ్లవులను ఓడించి భారతదేశపు సరిహద్దుకు రాజైనాడు. కుజుల అచ్చు వేయించిన రాగి నాణాలను బట్టి అతను క్రీ. శ. మొదటి శతాబ్దం మధ్యకాలంలో రాజ్యం చేశాడని తెలుస్తున్నది.

కుజుల అనంతరం విమ అనే వాడు రాజ్యం చేశాడు. బంగారు నాణాలు అచ్చు వేయించాడు. శైవ మతం పుచ్చుకుని తన నాణాలపై "మహీశ్వర" అని తన పేరు వేయించుకున్నాడు. కనిష్కుడు ఇతని అనంతరం రాజయాడనీ, క్రీ. శ. 78 లో శకమానం ఇతనే స్థాపించాడనీ చెబుతారు. కనిష్కుడి రాజధాని పురుషపురం (పెషావరు). అతని రాజ్యం గాంధారం నుంచి అయోధ్య, వారణాశీలదాకా ఉండేది. అయితే కనిష్కుడి కీర్తికి ప్రధాన కారణం అతను బౌద్ధమతానికి చేసిన సేవే. పెషావరు వద్ద గొప్ప చైత్యం నిర్మించాడు. బౌద్ధ గ్రంథాలపై భాష్యాలు రాయించాడు. "బుద్ధ చరితం" రచించిన అశ్వఘోషుడు ఇతని ఆస్థానకవి.

కనిష్కుడు 23 ఏళ్ళపాటు రాజ్యం చేశాడు. అతని అనంతరం వాసిష్కుడనే వాడు కొద్ది కాలం ఏలిన పిమ్మట హువిష్కుడనేవాడు రాజ్యానికి వచ్చాడు. హువిష్కుడేలిన సామ్రాజ్యం కనిష్కుడి సామ్రాజ్యం కంటె ఒక్క పిసరు హెచ్చే ఉండినట్టు కనిపిస్తుంది. ఇతని కాలంలో మధురానగరం ప్రాముఖ్యానికి వచ్చింది. ఇతని పరిపాలనకు సంబంధించిన వివరాలు కాబూలుకు పడమరగానున్న వర్దస్ వద్ద బయటపడ్డాయి.

కుషానుల శకం 98 ఏళ్ళు నడిచింది. కుషాను రాజులలో ఆఖరువాడు మొదటి వాసుదేవుడు. ఇతను 31 ఏళ్లు పాలించాడు. ఇతని శాసనాలూ, నాణాలు మధుర ప్రాంతంలో లభించాయి. ఈ నాణాల పైన శివుడి బొమ్మ తరుచుగా కనిపిస్తుంది.





# పార్వతీకల్యాణము

షష్ఠాశ్వాసము:

తన కన్నుల యెదుట మరుని
దహియించినయట్టి హరుని
చక్కదనము చేత బడయ
జాలక ఉమ తపము పూనె.

తపమువలన గాకుండిన
తనదు మేన సగ మొసంగి
అనురాగము చూపు నట్టి
పెనిమిటి లభియించుటెట్లు?

తన కుమార్తె శివునిగూర్చి
తపము చేయబూను టెఱిగి
మేనక కడు బుజ్జగించి
మెల్లగ నిట్లని పలికెను:

"తపముసేయ నడవులకు
తరల వలెన? ముద్దుకూన!
అ దేవత లిచట లేరె?
అడిగిన వరమీయ లేరె?

కోమలాంగి వీ వెక్కడ!
ఘోర వీర తప మెక్కడ!
తేటిని తలదాల్చు పూవు
డేగను భరియింప గలదె!"

అని మేనక వచియింపగ
అయుమ పెడచెవిని బెట్టె;
ఈప్సితార్థమునకు పోవు
ఇచ్చను ఎవరాప గలరు!

హిమవంతుడు గూడ వచ్చి
ఉమకు చెప్పి చూచినాడు,
పల్లమునకు పోవు నీరు
పయి కెవరును మలపలేరు!

తండ్రియాజ్ఞ పడసి గౌరి
తపముసేయ బూనుకొనెను;
సగలన్నియు తీసివేసి
నార చీర ధరియించెను.

ఉత్పల సత్యనారాయణాచార్య



జడలు పేని బిగియ గట్టి,
జపమాలను చేతబట్టి,
మెయినిండ విభూతి పూసి
బయలుదేఱె గౌరి యపుడు.

ఇరువైపుల జయవిజయులు
ఇష్టసఖులు తోడ నడవ,
సంగీతపు కెరటము వలె
సాగిపోయిరా ముగ్గురు.

హిమగిరి శిఖరాగ్రమందు
ఉమ తపంబు చేయసాగె,
దినదినమున కామె దివ్య
తేజముతో మెఱసిపోయె!

అన్న పానములను వదలె,
కన్నుగవను విప్పదాయె,
రోజు రోజు కామె దివ్య
తేజముతో మెఱసిపోయె!

పంచాగ్నుల మధ్యమందు,
మంచు నీటి కొలనులందు,
శివునిగూర్చి ఘోరతపము
చేయసాగె గిరి కుమారి.

పండుటాకులను సైతము
భక్షించుటమానె నామె;
ముని లపర్ణయని పేర్కొని
కొనియాడిరి హైమవతిని.

తపమున శుష్కింపజేసి,
తన దేహము శివుని మేన
అంటించెడు నట్లు వోలె
అర్ధనారి యయ్యె గౌరి.

ఒకనా డొక బ్రహ్మచారి
ఉదయారుణ బింబము వలె
పార్వతి యాశ్రమమునకును
పయనంబై వచ్చినాడు.

గౌరి యెదుట నిలిచి యతడు
కరము నెత్తి దీవించెను;
అయమ కడు భక్తితోడ
అతిథి పూజ గావించెను.

ఆమె చేయు సత్కారము
లంది యతడు సంతసించి,
చిఱునగవులు పెదవిపైన
చిందులాడ నిట్లనియెను :

"తరుణీ! హోమాదులకును
తఱుగన్నది లేదుకదా!
వ్రేగగు నీ తపమునకును
విఘ్నమొకటి రాదుకదా!

గంగోదకముల కంటెను
కన్యామణి! నీ కతమున
అద్రిరాజు సుపవిత్రుడు
ఐనాడని భావింతును.

శక్తికొలది తపశ్చర్య
సాగించెడు నట్లుంటివి;
అన్నిటి కంటెను ముఖ్యము
ఆరోగ్యము చూచుకొనుము.

ఏడడుగులు నడచినంత
ఏర్పడునట సంబంధము,
అందుచేత అప్తుడనై
అడిగెద నే నొక్కమాట.

అష్టైశ్వర్యము లుండిన
అద్రిరాజు కూతునకును
తపమున జగమందు పొంద
దగినది ఏమైయుండును?



తగిన వరుని కోస మీవు
తప మూనితివన్న కాదు—
ఇతరునిచే వెదకబడును
రతనము తా వెదకబోదు!"

అని పలుకగ శైలతనయ
విని నిట్టూర్పులు విడిచెను;
చనవు మెఱసి బ్రహ్మచారి
శైల తనయ కిట్లనియెను :

"చూడ నీవునుగూడ సొగసైన కన్యకవు;
బ్రహ్మచారిని, నన్ను పరిణయము సేకొనుము
కాదేని తపమందు గాఢాభి మతమున్న,
సగము నా తపమిత్తు, చాలించు నీ తపము."

అని పలుక హైమవతి ఆతనికి బదులీక
చెలిని కన్గొని సైగ చేయుగా జయ పలికె:
'బ్రహ్మచారీ! వినుము, పరమేశ్వరుని పతిగ
బడయ తలపోసి మా ప్రాణసఖి తపమూనె.'

ఆ మాట విని నంత అతడు పకపక నవ్వి,
"భళి భళీ! శివునటే పతిగ కోరిన దీమె!
శివుని మీ ప్రాణసఖి చెట్టవట్టెడునపుడు
పా మొకటి బుస్సనిన ఏమి చేయునొ ఈమె!

ఓ పార్వతీ! నాదు ఉపదేశమును వినుము
శివుని నేనెఱుగుదును, చెలి! నీకు తగడతడు;
నీదు సంసారంబు నిస్సారమగు నట్లు
బేలవై భిక్షుకుని పెండ్లాడ తలపకుము.

మరుని చంపినయట్టి అరసికుండగు శివుని
వరియించి నీ జన్మ వ్యర్థ మొనరింపకుము;
ననుగాక పోనిమ్ము, ఘనుని ఎవ్వనినైన
తగువాని పెండ్లాడి ధన్యురాలవు గమ్ము!"

ఆ మాటలకు గౌరి మోము చిట్లించినది,
కసితోడ నొకసారి కనులెఱ్ఱ జేసినది,
"చాలించు, ఓ బ్రహ్మచారి! నీ మాటలిక
తూలి శూలిని గూర్చి ప్రేలుచుంటివి నీవు."

అనుచు దిగ్గన లేచి హైమవతి నిలుచుండె,
బ్రహ్మచారియు నపుడు పరమేశ్వరుండయ్యె!
గౌరి కన్నులలోని కసియెల్ల మాయమయి
నునుసిగ్గు చిర్నగవు సూలుకొని విలసిల్లె!

"అగజ! నీదు తపమునకును
అమ్ముడు పోయినవాడను—
ఈశ్వరుడను, ప్రాణేశ్వరి!
ఏలుకొనుము నీ వాడను."

అనిన శివుని వంక గిరిజ
అల్లన కనులెత్తి చూచె;
వెండి కొండపై వెన్నెల
వెల్లి విరిసినట్లు తోచె! —(సశేషం)






## 12

[ క్షత్రియ యువకుల్లా వేషాలు మార్చుకునేందుకు కేశవుడూ, జయమల్లూ నిశ్చయించుకుని, బ్రహ్మదండి మాంత్రికుడు గుహలో దాచుకున్న బంగారం దొంగిలించారు. అదే సమయంలో బ్రహ్మదండి కేకలు పెడుతూ తన గది నుంచి బయిటికి పరిగెత్తాడు. అతణ్ణి కాపలాభటుడు అడ్డుకుని, తనతోటి భటుల కోసం కేకలుపెట్టాడు. తరవాత—]

గుండెల మీదికి సూటిగా గురిచేసివున్న ఈటే, కాపలాభటుడి కేకలూ వింటూనే, బ్రహ్మదండి మాంత్రికుడికి నిద్రమత్తు వదిలిపోయింది. అంతలో అక్కడికి మరిద్దరు కాపలాభటులు పరిగెత్తుకు వచ్చారు.

"పారిపోవాలని చూస్తున్నాడా? చూస్తారేం, పొడవండి!" అంటూ ఒక భటుడు ఈటెను పైకెత్తాడు. బ్రహ్మదండికి ప్రాణం కడబట్టినంత పనయింది. అతడో క్షణకాలం నోటి వెంట మాటరాక తడబడి, తరవాత కాస్త తెప్పరిల్లి. "అయ్యేల్లారా! వీరభట మహాశయుల్లారా! నన్ను చంపకండి. నేను పారిపోవాలని ప్రయత్నం చెయ్యలేదు," అన్నాడు వణికిపోతూ.

"పారిపోయేందుకు ప్రయత్నించలేదా? అయితే యిదంతా ఏమిటి? నేను అబద్ధాలకోరుననా నువ్వనేది!" అంటూ మొదట దారి అడ్డగించిన భటుడు, ఈటె తిరగవేసి బ్రహ్మదండి నెత్తిన ఒక్క బాదుబాదాడు ఆ దెబ్బకు బ్రహ్మదండి కింద కూలబడి,




గిలగిలలాడుతూ, "మహాభట కేసరీ! నన్ను చంపకు. నిద్రపోతూండగా పీడకల వచ్చి, ఆ మైకంలో గది నుంచి బయిటికి పరిగెత్తుకు వచ్చాను. నాదే తప్పు," అంటూ బావురుమన్నాడు.

కాపలాభటులు అతణ్ణి కాళ్లూచేతులూ పట్టుకుని దూలాన్ని మోసుకుపోయినట్టు గదిలోకి మోసుకుపోయి, మంచం మీదికి గిరవాటువేశారు. బ్రహ్మదండి మంచం మీదపడుతూనే, ఆ అదురుకు, ఎగిరి కింద నేల మీద వెల్లికిలాపడి, లేచి ఒళ్ళు దులుపుకుంటూ, "బాబులూ, శూరభట శార్దూలాలూ! నన్ను హింసించకండి. నా దగా



మారి శిష్యుడూ, మరొకడూ కలిసి, నేను రక్తం ఓడ్చి సంపాయించి దాచుకున్న డబ్బును దొంగిలిస్తూంటే చూసి, మతిచెడి తప్పుగా ప్రవర్తించాను," అన్నాడు.

"నీ కింకా మతిచెడే వున్నది," అన్నాడొక కాపలాభటుడు, బ్రహ్మదండి కేసి అనుమానంగా చూస్తూ, "ఇందాక, ఏదో పీడకలవచ్చి, బయిటికి పరిగెత్తానన్నావు. ఇప్పుడు నీ దగామారి శిష్యులు, నువ్వు దాచుకున్న బంగారం ఎత్తుకుపోతూంటే చూసి, మతిచెడిందంటున్నావు? ఏది నిజం?" అని అడిగాడు.

"వీడు మళ్ళీ కొండల్లోకి పారిపోయేందుకు ఏదో ఎత్తువేస్తున్నాడు. వీడి ఆట కట్టించాలంటే, రాజగురువు కోసం కబురు పంపాల్సిందే," అన్నాడొక భటుడు.

రాజగురువు పేరు వింటూనే, బ్రహ్మదండి గడగడా వణికిపోతూ, "నాయనలారా! యోధభట భల్లూకాల్లారా! నన్ను కరుణించండి. ఈ అర్ధ రాత్రంలో వెళ్ళి రాజగురువును నిద్రలేపితే, ఆ కోపంలో ఆయన నన్నేమిచేసినా చేయవచ్చు. నా తప్పు మన్నించండి!" అన్నాడు.

కాపలాభటులు తమలోతాము కూడబలుక్కుని, మాంత్రికుడి గది తలుపులు





బిగించి, అక్కడ యిద్దరు కాపలావుండగా, మూడోవాడు రాజగురువు దగ్గిరకుపోయాడు. రాజగురువు భటుడు చెప్పిందంతా విని, "మంచిపని చేశారు. తెల్లవారుతూనే వాణ్ణి రాజుగారి దగ్గిరకు తీసుకురండి. మీ నాయకుడితో, కొండల్లోని బ్రహ్మదండి గుహ దగ్గిర ఏమి జరిగిందో తెలుసుకురమ్మన్నానని చెప్పండి," అన్నాడు.

సూర్యోదయం అయేలోపలే నలుగురు భటులు, బ్రహ్మదండి మాంత్రికుడి గుహ దగ్గిరకు వెళ్ళి, గుహ ముందు కాళ్ళూ చేతులూ కట్టి పడవేయబడివున్న తమ యిద్దరు అనుచరుల్ని చూశారు. వాళ్ళు రాత్రి జరిగిన సంగతంతా చెప్పారు.

గుహ దగ్గిర్నుంచి భటులు రాచనగరుకు తిరిగి వచ్చేసరికి, అక్కడ రాజూ, రాజగురువుల ముందు బ్రహ్మదండి మాంత్రికుడు చేతులు కట్టుకు నిలబడి వున్నాడు. భటులు జరిగిందంతా చెప్పారు.

అంతా శ్రద్ధగా విన్న రాజగురువు, "కాపలా భటుల్ని కాళ్ళూచేతులు కట్టి గుహలో ప్రవేశించిన వాళ్ళు బందిపోట్లు కాదు. కేశవుడూ, జయమల్లూ అయి వుంటారు. పోతే, ఆ మూడోవా డెవడైనదీ తెలియటం లేదు!" అన్నాడు.



"అనుమాన మేల రాజగురు చూడామణీ! వాడు, కేశవుడి తండ్రి అయిన ముసలివాడు! నా పీడకల సంగతి చెప్పాను గదా? అందులో ఆ ముసలి వెధవ కనిపించలేదు. ఏమైతేనేం, నా నిధి దొంగిలించబడింది," అంటూ బ్రహ్మదండి కళ్ళనీళ్ళ పర్యంతమయాడు.

రాజగురువు, మాంత్రికుడి కేసి జాలిగా చూస్తూ, "విచారించకు బ్రహ్మదండీ! రాకాసిలోయలో దొరికే నిధుల్లో నీకూ భాగం వుంటుంది. మనక్కావలసిన కేశవుడు యింకా మన రాజ్య సరిహద్దుల్ని దాటిపోలేదని కూడా తేలిపోయింది. వాణ్ణి





పట్టుకునేందుకు ప్రయత్నిద్దాం. కాని, వాడి ప్రయాణంకూడా రాకాసిలోయకే అని అర్థమవుతున్నది. దారి ఖర్చుల కోసం నీ బంగారం దొంగిలించాడు. పాపం," అన్నాడు రాజగురువు.

బ్రహ్మదండి కోపంతో బుసలుకొడుతూ, "మహారాజా! మహారాజగురుశేఖరా! ఇక నాకు అనుమతి యిప్పించండి. తమరు వేసిన పథకం ప్రకారం, నేను రాకాసి లోయ చేరి, ఆ దుష్టులైన కేశవ జయమల్లుల్ని, కాలభైరవుడికి బలిచేసి, అక్కడ లభించే ధనరాసుల్ని తమ వద్దకు పటుకు వస్తాను," అన్నాడు.



రాజగురువు అక్కడ నిలబడివున్న భటుల్ని వెళ్ళిపొమ్మని చెప్పి, రాజుతో, "మహారాజా! బ్రహ్మదండీ, జితవర్మా, శక్తివర్మల ప్రయాణానికి, ఈ సాయంకాలం ముహూర్తం పెట్టాను. ఎవరికీ ఎలాంటి అనుమానం కలక్కుండా వుండేందుగ్గాను, మన వేగులవాళ్ళు, యీ సరికే నగరంలో, అవసరం అయిన వదంతులు లేవదీసి వుంటారు," అన్నాడు.

రాజగురువు చెప్పినట్టు, ఆ నాటి సూర్యోదయం వేళకే బ్రహ్మపుర నగరంలో ఒక వదంతి ప్రచారం కాసాగింది. రాజగురువు కాలిమీద ఎప్పుడో ఒక వ్రణం లేచిందనీ, అది ఎన్ని చికిత్సలకూ లొంగనందున, వింధ్యారణ్యాలలో దొరికే ఒక ఓషధి కోసం బ్రహ్మదండి మాంత్రికుడు వెళుతున్నాడనీ ప్రజలు చెప్పుకోసాగారు.

రాకాసిలోయలో ఏవో నిధుల కోసం బ్రహ్మదండి వెళుతున్నాడని తెలిస్తే, అతడు ప్రయాణించవలసిన దేశాలరాజులు, అతడికి ఆటంకాలు కలిగిస్తారని రాజగురువు, ఈ వదంతి ప్రచారంలో పెట్టించాడు. రాజగురువు ప్రాణ రక్షణకోసం ఏదో ఓషధో, మూలికో తెచ్చుకునేందుకు వెళ్ళే మనుష్యుల్ని ఎవరూ ఏమీ చేయరు సరి కదా,



ప్రయాణానికి అవసరం అయిన సహాయం కూడా చేస్తారు.

మొత్తం మీద రాజగురువు వేసిన ఎత్తు గడ పారింది. మహా దుష్టమాంత్రికుడని పేరుమోసిన బ్రహ్మదండి, ఇరవైనాలుగ్గం టల్లో ఘనవైద్యుడుగా అందరిచేతా చెప్పుకో బడ్డాడు. "అతడెంత గొప్ప వైద్యశాస్త్రసిధి కాకపోతే, రాజగురువు తన దీర్ఘవ్యాధిని కుదిర్చేందుకు అతణ్ణి నియమించు కుంటాడు!" అనుకున్నారు ప్రజలు.

ఆ రోజు సాయంకాలం బ్రహ్మదండి మాంత్రికుణ్ణి వింధ్యారణ్యాలకు సాగనం పేందుకు రాజగురువు స్వయంగా నగర ద్వారం దగ్గిరకు వచ్చాడు. ఆయన లోగడే, రాజాస్థానంలో ఉద్యోగాలు చేస్తున్న యిద్దరు యువకుల్ని—జితవర్మ, శక్తివర్మ—అనే వాళ్ళను బ్రహ్మదండి వెంట వెళ్ళేందుకు నియమించాడు. వాళ్ళపని, రాకాసిలోయలో ఒకవేళ నిధినిక్షేపాలు దొరికితే, వాటి నెత్తు కుని బ్రహ్మదండి పారిపోకుండా చూడటం. కాని, ప్రయాణంలో ఎవరైనా అడిగితే మాత్రం, తామిద్దరూ అతడి అంగరక్షకు లుగా నియమించబడినట్టు బొంకాలి.

నగరం ప్రవేశించేప్పుడు ఎంతో అవ మానించబడిన బ్రహ్మదండి, నగరం వదిలి పోయేప్పుడు గొప్పగా సన్మానించబడ్డాడు.





నగరద్వారం వద్ద గుంపులు గుంపులుగా చేరిన ప్రజల్లో కొందరు అతడి మెడలో పుష్పమాలలు కూడా వేశారు. ఆటలూ, వినోదాలూ కూడా సాగినై.

ఇక్కడ బ్రహ్మపుర నగరాన్ని మాంత్రికుడు వదిలివెళ్ళే సమయంలో, అక్కడ అడవి మధ్య దాగివున్న కేశవుడూ, జయమల్లూ కూడా వింధ్యారణ్యాలకు వెళ్ళేందుకు తయారవుతున్నారు. కేశవుడి తండ్రి కొని తెచ్చిన దుస్తులు ధరించటంతో వాళ్ళిద్దరూ క్షత్రియ యువకుల్లా మారిపోయారు. డాలూ, కత్తీ, శిరస్త్రాణం, అంబులపొదీ— వాళ్ళ నిప్పుడు చూచిన వాళ్ళెవరూ, గొర్ల



కాపరీ, బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుడూ అని గుర్తించలేరు.

ఈ విధంగా వాళ్ళిద్దరూ వేషాలు వేసుకుని బయలుదేరనున్న సమయానికి, ముసలివాడు తానూ వాళ్ళ వెంట వస్తానని పట్టుబట్టాడు. కేశవుడూ, జయమల్లూ అతడికి దారిలో ఎదుర్కోవలసివున్న ఆపదలను గురించి చెప్పారు. ఈ వృద్ధాప్యంలో కొండలూ, అడవుల వెంట పడి కొన్నివందల కోసుల దూరం నడవటం కష్టమని అన్నారు. కాని, ముసలివాడు తన పట్టు వదలలేదు.

"సరే, ఈ రూపంలో నిన్ను ఎవరైనా గుర్తిస్తారు, ఎట్లా ?" అన్నాడు కేశవుడు.

ముసలివాడు ఎగిరి గంతేశాడు. "నగరంలో మీకు దుస్తులు కొనేప్పుడే, నాకూ అవసరం అయిన దుస్తులు కొనుక్కున్నాను. కొంచెం ఆగండి. నన్ను మీరు గుర్తించగలరో లేదో చూస్తాను!" అంటూ ముసలివాడు చెట్లచాటుకు వెళ్ళి, పావు గంట కాలం గడిచీగడవక ముందే, తిరిగివచ్చాడు.

ముసలివాడి వేషం చూసి, కేశవుడూ, జయమల్లూ పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. పట్టువస్త్రాలూ, మెడలో రుద్రాక్షమాలా, చేతిలో దండకమండలాలూ, చెవులకు కుండలాలూ, ముఖాన





విభూతిరేఖలూ—అత డిప్పుడు అచ్చు పండితుడిలా వున్నాడు.

"నే నిప్పుడు, మీ యిద్దరికీ గురువును! రాజపుత్రులను దేశాటన చేయించేందుకు బయలుదేరినవాణ్ణి, తెలిసిందా?" అన్నాడు ముసలివాడు.

"అది బాగానేవుంది, గురూ! కాని మనం దారిలో ఏ నగరానికైనా వెళితే, అక్కడ పండితులు నిన్నేమైనా ప్రశ్నిస్తే, అప్పుడు మనం ఏమయేట్టు?" అని అడిగాడు జయమల్లు.

"గురు మౌనానందుడు! ఈ యాత్రలో ఆయన తన శిష్యులతో తప్ప, మరెవరితోనూ మాట్లాడరు, సరిపోయే!" అన్నాడు ముసలివాడు.

కేశవుడికి తన తండ్రిని వెంటపెట్టుకు వెళ్ళటమే క్షేమమనిపించింది. ఈ వయసులో అతణ్ణి, ఈ అరణ్యంలో వదలిపోవటం మంచిదికాదు. ఈ సరికి బ్రహ్మపురరాజ్యంలో వున్నవాళ్ళందరికీ, తాము తండ్రి కొడుకులమన్న సంగతి తెలిసిపోయి వుంటుంది. తన తల విలువ ఒక చిన్న సామంతరాజ్యం. ఆ ఆశ వున్నవాళ్ళెవరూ తన తండ్రి దొరికితే, తన జాడలు తెలుసుకునేందుకు, అతణ్ణి హింసించక మానరు.



కేశవుడు తండ్రి కేసి ప్రేమగా చూస్తూ, "అయ్యా,..." అని ఏమో చెప్పబోయేంతలో ముసలివాడు, ముఖంలో లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుని, "అయ్యా కాదు...గురూ!" అన్నాడు కఠినంగా.

కేశవుడికీ, జయమల్లుకూ నవ్వాగింది కాదు. కేశవుడు తన తండ్రిని సమీపించి, అతడి చేయిపట్టుకుని ముందుకు నడిపిస్తూ, "గురూ, యిక మనం బయలుదేరుదాం. చీకటిపడే వేళకన్నా, మనం ఏదైనా పల్లె చేరాలి. ఈ రాత్రికి అక్కడే పండుకుని, తెల్లవారి మన ప్రయాణాని కవసరం అయిన గుర్రాలు కొనుక్కుని ముందుకు సాగుదాం.



కాలినడకన రాజకుమారులూ, వాళ్ళ గురువూ దేశాటన చేస్తున్నారంటే, ఎవరికైనా అనుమానాలు కలగవచ్చు," అన్నాడు.

అరణ్యంలో దాదాపు రెండు గంటల కాలం ప్రయాణంచేసి, చీకటిపడుతూండగా ముగ్గురూ ఒక పల్లె చేరారు. వాళ్ళు వీధిలో నడుస్తూండగా, రచ్చబండ చుట్టూచేరిన జనం అనుకునే మాటలు వాళ్ళకు కొంత ఆశ్చర్యాన్నీ, భయాన్నీ కూడా కలిగించినై.

"బ్రహ్మదండి మాంత్రికుడు, ఇద్దరు అంగరక్షకుల్ని వెంటపెట్టుకుని, వింధ్యారణ్యాలకు వెళుతున్నాడట! అక్కడ మాత్రమే పెరిగే ఒక ఓషధి తెచ్చి, ఎన్నాళ్ళుగా నయంకాని రాజగురువు కాలి వ్రణాన్ని నయం చేస్తాడట!"

"ఇందులో ఏదో మోసం వున్నది. అయినా, మనం రాజపుత్రులం కనక, ఈ అలగా జనం ఆడుకునే ఊసుకబుర్లలో తల దూర్చకూడదు," అంటూ జయమల్లు కేశవుడికి సంజ్ఞచేసి, రచ్చబండ దగ్గిరవున్న జనంతో, "ఈ పల్లెలో పూటకూళ్ళ యిల్లు ఎక్కడో చెపుతారా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే ఒక వృద్ధుడు ముందుకు వచ్చి, "అయ్యా, పూటకూళ్ళ యిల్లు యీ దగ్గిర్లోనే వున్నది. కాని, అక్కడ మీకు వసతి దొరకదేమో అని నా భయం. రాజుగారి అజ్ఞాపత్రం తీసుకుని, బ్రహ్మదండి అనే ఒక ఘనవైద్యుడూ, అతడి అంగరక్షకు లిద్దరూ, ఈ రాత్రికి, అక్కడే దిగబోతున్నారని వార్త వచ్చింది," అన్నాడు.

ఆ మాటలు వింటూనే కేశవుడూ, జయమల్లూ గతుక్కుమన్నారు. కాని, ముసలివాడు మాత్రం దండం పైకెత్తి, "అలాగా, సరే, చూద్దాం. దేశాటనకు బయలుదేరిన రాజకుమారులు పూటకూళ్ళ కొంపలోనే, రాత్రంతా గడపాలని ఎక్కడుంది? ఓయి, శిష్యులూ! రండి, నడవండి!" అంటూ ముందుకు కదిలాడు. —(ఇంకా వుంది)





# దుష్టుడికి ఆతిథ్యం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అనాముడి వంటి తామసుడు కూడా ఒక్క అపజయంతో మారిపోయాడు గాని, నీ ప్రయత్నం ఇన్నిసార్లు విఫలమయినప్పటికీ నీలో మార్పు రాకుండా ఉన్నదే. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అనాముడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్ప నారంభించాడు:

ఒక అరణ్యంలో అనాముడనే ఆటవిక యువకు డొకడుండే వాడు. వాడు మహా బలశాలి, మహా సాహసి. వాడికి బంధువులు గాని, అనుచరులు గాని ఎవరూ లేరు. వాడు వన్యమృగంలాగా అరణ్యమంతా కారాడుతూ, ఆకలి అయినప్పుడు ఏ చెట్ల కాయలో తింటూ, మృగాలు దొరికినప్పుడు

బేతాళ కథలు



వాటిని వేటాడుతూ, అలసినప్పుడు ఏ చెట్టు మీదనో, ఏ వాగు పక్కనో నిద్రపోతూ అనాగరికుడై జీవిస్తూ ఉండేవాడు. వాడి వద్ద ఒక కత్తి, ఒక ఈటె ఉండేవి.

ఒకనాటి ఉదయం వాడు ఒక వాగు పక్కన నిద్ర లేచే సరికి అంత దూరాన వాడి కేసే చూస్తూ ఒక లేడి కనిపించింది. వెంటనే వాడు తన కత్తి, ఈటె పట్టుకుని దాని వెంట పడ్డాడు. వాడు దాదాపు లేడితో సమంగా పరిగెత్త గలవాడు కావటంచేత చాలాదూరం లేడిని తరుముకుంటూ పోయాడు. లేడి పరుగెత్తి పరుగెత్తి ఒక ఎడారిలాటి ప్రాంతానికి అనాముణ్ణి తీసుకుపోయింది.

అక్కడ కొండలూ, తిప్పలూ తప్ప ఇంకేమీ లేవు. ఈ ఎడారినపడి ఎంతోదూరం వెళ్ళాక లేడి కాస్తా ఎటో మాయమయింది. అప్పుడు గాని అనాముడు తన పరిసరాలను గమనించలేదు. చుట్టూ కనుచూపుమేరలో రాళ్ళూ, రప్పలూ తప్ప ఒక చెట్టుగాని, నీడగాని, ఒక పిట్టగాని, చిన్న నీటి గుంటగాని ఉన్నట్టు కనిపించలేదు. మధ్యాహ్నపు ఎండ మండిపోతున్నది. అనాముడు చాలా దూరం పరుగెత్తటంచేతా, పొద్దునే లేచి పచ్చి మంచినీరైనా తాగకపోవటం చేతా దాహంతోనూ, ఆకలితోనూ బాధ పడుతున్నాడు.

తనకి రాళ్ళ గుట్టల మధ్య చావు తప్పదని వాడనుకుంటూండగా ఉత్తర దిక్కుగా భూమి అంచున ఆకుపచ్చని చారా, దానికి కొంచెం ఎగువగా పొగా కనిపించాయి. వాడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అక్కడ చెట్లూ చేమలూ ఉండవచ్చు, మనుషులుకూడా ఉండవచ్చు ననుకుని, పోతున్న ప్రాణాలను కూడగట్టుకుని అనాముడు ఉత్తరంగా నడిచి నడిచి కొంత సేపటికి ఒక వనాన్ని చేరుకున్నాడు.

వనానికి ఒక పక్కగా చిన్న ఏరు ప్రవహిస్తున్నది. ఏటి ఒడ్డున అంతులేని ఫల వృక్షాలున్నాయి. అనాముడు ఏట్లోకి దూకి

చల్లని నీటితో సేద దీర్చుకుని, తాగగలిగి నన్ని నీళ్ళు తాగాడు. పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది.

దాహం తీర్చుకుని పైకిరాగానే అనాముడి కళ్ళకు చెట్లమధ్య ఒక కుటీరమూ, దాని చుట్టూ పూల మొక్కలూ కనిపించాయి. చూస్తే అదొక ఋష్యాశ్రమంలాగా ఉన్నది. అక్కడ తనకు తిండి దొరకవచ్చు నన్న ఆశతోనూ, తన బల పరాక్రమాలకు ఎదురుండదన్న దర్పంతోనూ అనాముడు ఠీవిగా ఆ కుటీరంలోకి అడుగుపెట్టాడు.

కుటీరం లోపల మునీశ్వరులు కనిపించటానికి బదులు ఒక నవమన్మథుడులాటి యువకుడూ, అప్సరసలను మించే అందం గల ఒక స్త్రీ కనిపించారు. వారు నార బట్టలకు బదులు రాజోచితమైన మేలి దుస్తులు ధరించి, దర్భాసనాల మీదగాక రత్న కంబళాలపై సుఖాసీనులై ఉన్నారు. యువకుడు నూనూగు మీసాలవాడు. యువతి అంత కంటె కొంచెం పెద్దదిగా ఉన్నది.

"ఎవరో అతిథిలాగున్నది! రండి, దయ చెయ్యండి. అక్కా, ఆయనకు నీరియ్యి," అన్నాడు యువకుడు. యువతి లేచి వెళ్ళి బంగారు పాత్రతో నీరు తెచ్చి అనాముడికి ఇచ్చింది. అనాముడు అసలే పశుప్రాయుడు, అనాగరికుడు. వాడికి ఆ యువతిని చూడ





గానే వెర్రిగా మోహావేశం కలిగింది. వాడు ఆమె కేసి వెకిలిగా చూస్తూ, "ఏమి అందం! ఏమి అందం! ఇవాళ నా అదృష్టం పండింది!" అన్నాడు.

అప్పుడా యువకుడు వాడితో, "అయ్యా, నీ వెవరో మాకు తెలియదు. అభ్యాగతిగా వచ్చావు గనక ఆతిథ్యం ఇవ్వటం మా ధర్మం. మా ఆతిథ్యం స్వీకరించి నీ దారిన నీవు వెళ్ళటం మంచిది," అని మృదువుగా మందలించాడు.

"నా పేరు అనాముడు. నేను మహా వీరుణ్ణి. నేను అయిదు వందల మంది యోధులకు సమానమని ఈ ప్రాంతంలో ఎవరి నడిగినా చెబుతారు," అన్నాడు అనాముడు దర్పంగా.

"నా పేరు సుమిత్రుడు. ఈమె నా అక్క మాధవి. మేము విశాలరాజు బిడ్డలం. మా అన్న రాజ్యం చేస్తున్నాడు. ఇది మా నాన్నగారు నిర్మించుకున్న ఆశ్రమం. ఆయన పోయాక ఈ ఆశ్రమం పాడుపెట్టకుండా మేమిక్కడే ఉంటున్నాం. మాకు రాజభోగాలకన్న ఈ ప్రకృతి సౌందర్యమే ఎక్కువ ఆనందం ఇస్తున్నది," అన్నాడు యువకుడు.

"అయితే నీ అక్కను పెళ్ళిచేసుకుంటాను," అన్నాడు అనాముడు.

"మా కిద్దరికీ కూడా పెళ్ళి చేసుకోవాలన్న ఇచ్ఛ లేదు," అన్నాడు సుమిత్రుడు.

అనాముడు మండిపడి, "మీ ఇష్టం ఎవరికి కావాలి? నేను చేసుకుంటానంటూంటే?" అన్నాడు.

"నీవు అతిథి ధర్మాన్ని అతిక్రమిస్తున్నావు. ఈ ఆశ్రమంలో దౌర్జన్యంగా ఏ పని అయినా చెయ్యదలిస్తే ముందు నన్ను గెలవాలి. బయటికి పద, మన బలా బలాలు తేల్చుకుందాం," అంటూ సుమిత్రుడు కత్తి ఒకటి తీసుకుని కుటీరం బయటికి నడిచాడు.

అనాముడికి ఆగ్రహావేశం హెచ్చి పోయింది. "ఈ అర్భకుడు నాతో పోటీకి వస్తాడా?" అన్న భావంతో వాడు తన కత్తి దూసి సుమిత్రుడి పైకి పులిలాగా లంఘించాడు. మరుక్షణమే వాడి చేతిలోని కత్తి ఎగిరి పది గజాల దూరాన పడిపోయింది. ఇందుకే వాడు ఆశ్చర్యపోతూ ఉండగా సుమిత్రుడు తన కత్తి కింద పడేసి, వాణ్ణి కుడిచేత నడుము పట్టి పట్టుకుని కుక్క పిల్లను ఎత్తినట్టు ఎత్తి, గాలిలోకి ఎగరేసి ఎడమచేత్తో అవలీలగా గాలిలోనే తిరిగి పట్టుకున్నాడు.

అనాముడికి దడ పుట్టుకొచ్చింది. వాడు ఒక క్షణంసేపు, "ఇది నిజం కాదు, కల! పీడ కల!" అనుకున్నాడు. మరుక్షణం, "వీడు మనిషి కాదు; చిన్న పిల్లవాడి రూపం ధరించిన బ్రహ్మరాక్షసి!" అనుకున్నాడు. సుమిత్రుడు అనాముణ్ణి కిందకు దింపి, "నిన్ను అవలీలగా చంపగలను గాని అతిథిని చంపటం అధర్మం. అదీగాక నీ పైన నా కేమీ శత్రుత్వమూ లేదు. వచ్చి భోజనం చేసి, మేమిచ్చే కానుకలు పుచ్చుకుని నీ దారిన నీవు వెళ్ళ వచ్చు!" అన్నాడు. అనాముడు పిల్లిలాగా అయిపోయి సుమిత్రుడి వెంట కుటీరం లోపలికి ప్రవేశించాడు. మాధవి వాడికి విస్తరి వేసి, షడ్రసోపేతంగా భోజనం పెట్టింది. సుమిత్రుడు తన స్థానంలో వెళ్ళి కూచుని, భోజనం చేస్తున్నంతసేపూ వాడి కేసి చూడనైనా చూడక ఏదో చదువుకున్నాడు.



భోజనమైనాక మాధవి వాడికి మంచి మంచి బట్టలూ, కొన్ని ఆహార పదార్థాలూ, కొంత ధనమూ ఇచ్చి, "తీసుకో, నాయనా!" అన్నది.

అక్కడ ఉన్నంతసేపూ అనాముడికి తానొక పురుగులాటి వాణ్ణనీ, తనకు అతిథ్యం ఇచ్చినవారు దేవతల వంటి వారనీ, అటు వంటివారి స్నేహం వల్ల తానుకూడా బాగు

పడ వచ్చుననీ ఎంతగానో అనిపించింది. అక్కా తమ్ముళ్ళు మాట్లాడుకుంటూ ఉంటే, తనకుకూడా వారిలాగా మాట్లాడటం చేతనైతే ఎంత బాగుండుననిపించింది. కాని వాళ్ళిచ్చే ఆతిథ్యం ఇవ్వటం పూర్తి అయాక ఒక్క క్షణంపాటైనా వారి ఎదట ఉండటానికి వాడికి మొహం చెల్లలేదు.

వాడు వాళ్ళిద్దరి వద్దా తల వంచుకుని సెలవు పుచ్చుకుని తానుండే అరణ్యానికి తిరిగి వచ్చాడు.

ఆ తరవాత అనాముడు తన ఒంటరి జీవితం మానేసి సాటివాళ్ళ మధ్యకు వెళ్ళాడు. ఈ ఒక్క అనుభవంతోనే వాడిలో ఎంత మార్పు వచ్చిందంటే, త్వరలోనే వాడి అనుచరులైన ఆటవికులు వాణ్ణి రాజుగా చేసుకుని, వాడి నాయకత్వం కింద తమ జీవితాలను ఎంతో బాగు చేసుకున్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, అనాముడిలో పరివర్తన కలగటానికి కారణం సుమిత్రుడి బల పరాక్రమాలా? లేక అతని సంస్కారమా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల వెయ్యి చెక్కలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఓడినవాడు ఓడినంత మాత్రాన మారడు. గెలుపు కన్నా ఓటమి మనుషులను మరింత పశువులుగా చేస్తుంది. సుమిత్రుడు అనాముణ్ణి కేవలం బలంతో మాత్రమే గెలిచినట్టయితే, అనాముడు ఏదో మాయోపాయంచేత మాధవిని ఎత్తుకుపోయి ఉండేవాడే. సుమిత్రుడు బలంతో గెలవటం అంత ప్రధానం కాదు; అతను అనాముడి పైన నైతిక విజయంకూడా సాధించాడు. అందుకే అనాముడిలో మంచి పరివర్తన కలిగింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# నౌకరు యుక్తి

ఒక ఊళ్ళో ఒక సామాన్యపు రైతు ఉండే వాడు. అతను బ్రహ్మచారి కావటం చేత ఇంటి పని చేసేటందుకొక వంటవాణ్ణి పెట్టు కున్నాడు. ఈ వంటవాడు వంట చెయ్యు టంలో బహు నేర్పరి.

ఒక ఏడు మామిడి పళ్లకాలం వచ్చింది. ఒకనాడు రైతు ఏదో పని మీద పోతూ ఉండగా ఒక ఎరిగిన ఆసామి కనిపించి, "చాలా మేలు రకం మామిడి పళ్ళు తెప్పించాను. రెండిస్తాను, పట్టుకు వెళ్ళి ఎంత బాగుంటాయో తిని చూడు," అంటూ రెండు పళ్ళు చేతిలో పెట్టాడు. అంత సువాసన గల మామిడి పళ్ళను రైతు ఎన్నడూ చూడనైనా లేదు. ఆయన వెంటనే ఇంటికి తిరిగి వచ్చి ఆ మామిడి పళ్ళను తన వంటవాడి కిచ్చి, "వీటిని చక్కగా కడిగి, ముక్కలు తరిగి ఉంచు. నే నిప్పుడే వస్తాను," అంటూ తన పని మీద వెళ్ళాడు.

వంటవాడు ఆ మామిడి పళ్ళను కడిగి, చెక్కు తీసి, ముక్కలు తరుగుతూ, ఎలా ఉంటుందో రుచి చూద్దామని ఒక ముక్క నోట వేసుకున్నాడు. రుచి వర్ణనాతీతంగా ఉంది. తరిగేసిన మామిడి కాయలో రెండు ముక్కలు తరుగైతే ఎవరు కనుక్కో వచ్చారు లెమ్మనుకుని మరి రెండు ముక్కలు నోట వేసుకున్నాడు. తింటున్న కొద్దీ మామిడి ముక్కల రుచి హెచ్చు తున్నట్టు కనపడింది. రెండు కాయలూ ముక్కలు తరిగే లోపుగా ముక్కల్లో సగా నికి పైగా వంటవాడి కడుపులోకి వెళ్ళి పోయాయి. మిగిలిన ముక్కలను చూస్తే వంటవాడికి భయమయింది.

ఏం చెయ్యాలి? తరిగిన ముక్కల్లో కొన్ని తిన్నానంటే యజమాని కది క్షమించ రాని తప్పవుతుంది. కనక ఏదో ఒక బొంకు బొంకక తప్పదు. చిన్న బొంకు కన్న పెద్ద

ఐ. పూర్ణచంద్రశేఖరరావు

బొంకు తేలిక. రెండు మామిడి పళ్ళూ పోయాయని చెప్పటం సులువు. ఆ మాటే చెబుదామనే ఉద్దేశంతో వంటవాడు మిగిలిన ముక్కలన్నీ తినేసి, తొక్కలూ, టెంకలూ నరమానవుడికి కనిపించని చోట పారేసి, పళ్ళెమూ అదీ కడిగి యజమాని కోసం ఎదురు చూస్తూ కూచున్నాడు.

ఈలోపల రైతు తన పని చూసుకుని ఇంటికి తిరిగి వస్తుండగా ఎవరో సాధువు ఎదురయాడు. ఆ సాధువును చూడగానే తనకు దొరికిన మామిడి పళ్ళలో కొంత ఆయనకు పెట్టి ఇంత పుణ్యం సంపాదించుకుందామని పించింది రైతుకు. అందుచేత ఆయన సాధువును పలకరించి, దూర ప్రాంతం వాడని తెలుసుకుని, "స్వామీ, మా ఇల్లు ఈ దాపులనే వున్నది, దయ చెయ్యండి. పది నిమిషాల కన్న మిమ్మల్ని ఉంచను," అన్నాడు.

సాధువు సరేనని రైతు వెంట వచ్చాడు. రైతు ఆయనని ఇంటి ముందు వసారాలో కూచోమని, లోపలికి వెళ్ళి వంటవాడితో, "ఎవరో సాధువును తీసుకొచ్చాను. మామిడి పళ్ళు కోసి సిద్ధంగా ఉంచావా? ఆయనకు కాసిని ముక్కలు పెడదాం," అన్నాడు.

"ఏం పెట్టి కొయ్యను? కత్తి పట్టి మొద్దు కత్తి," అంటూ వంటవాడు ఒక బండ కత్తి



అటక మీదినుంచి తీసి యజమానికి చూపించాడు.

"అలాగా! దీనికి పదును పెట్టి ఇప్పుడే తెస్తానుండు. ఇంటికి పట్టుకొచ్చిన సాధువును పట్టి చేతులతో ఎలా పంపెయ్యటం?" అంటూ రైతు ఆ మొండి కత్తి తీసుకుని దొడ్లోకి వెళ్ళి, అక్కడ ఒక వీలయిన రాయి చూసి, దానిపై ఆ మొండి కత్తిని సానపట్ట నారంభించాడు.

ఈ లోపల వంటవాడు వసారాలోకి వచ్చి సాధువుతో రహస్యంగా, "ఈయనకు మీరెలా దొరికారు, స్వామీ? ఈయన సంగతి తెలీదా?" అని అడిగాడు.

"నా కెలా తెలుస్తుంది, నాయనా? నేనీ వూరికే కొత్తవాణ్ణి. మీ యజమానిని ఇంతకు పూర్వం చూడనన్నా లేదు," అన్నాడు సాధువు.

"చూడండీ, ఈయన శక్తి పూజ చేస్తాడు. మీలాటి సాధువులు కనిపిస్తే ఇంటికి పిలిచి, రెండు చెవులూ కోసి నైవేద్యం పెడతాడు. ఇలా చాలా మందిని చేశాడు. అదుగో, ఆ చప్పుడు వినండి. దొడ్లో కత్తికి పదును పెడుతున్నాడు. చెవులు కోసేటప్పుడు మీ వంటి వారికి ఆటే బాధ కలగరాదని ఆయన ఉద్దేశం!" అన్నాడు వంటవాడు.



ఈ మాట విన్నాక సాధువు ఒక్క క్షణం అక్కడ ఉండదలచక, బతికుంటే బలుసాకు తిన వచ్చుననుకుని, కూచున్న చోటునుంచి లేచి బయలుదేరాడు.

కొంత సేపటికి రైతు కత్తితో లోపలికి వచ్చి వంటవాణ్ణి చూసి, "ఇదుగో, కాస్త పదును పెట్టాను. వేగిరం పళ్ళు కోసెయ్యి. పాపం, సాధువు చాలా సేపుగా వేచి ఉన్నాడు," అన్నాడు.

"ఇంకెక్కడి పళ్ళు? ఇంకెక్కడి సాధువు? మీరలా దొడ్లోకి వెళ్ళారో లేదో ఆయన లోపలికి వచ్చి రెండు పళ్ళూ తీసి జోలెలో వేసుకుని ఉడాయించేశాడు," అన్నాడు వంటవాడు.

"రెండు పళ్ళూ తీసుకున్నాడా? ఒకటైనా ఉంచమనక పోయావా? రుచి అయినా చూసేవాళ్ళం!" అన్నాడు రైతు.

"నేను పిలుస్తుంటే వినిపించుకోకుండా పరిగెత్తాడు," అన్నాడు వంటవాడు.

రైతు చేతిలో కత్తి అలాగే పట్టుకుని వీధిన పడ్డాడు. కొంత దూరం పరిగెత్తాక సాధువు అంత దూరాన కనపడ్డాడు.

"స్వామీ, ఒక్క క్షణం ఆగండి!" అంటూ రైతు కత్తి పట్టుకున్న చెయ్యి ఎత్తి ఊపాడు. సాధువు వెనక్కు తిరిగి చూసే సరికి గుండె జారిపోయింది. ఆయన వేగంగా పరిగెత్తసాగాడు.

"స్వామీ, రెండూ వద్దు. కనీసం ఒక్కటి ఇవ్వండి చాలు! ఒక్కటైనా ఇవ్వండి," అని రైతు గట్టిగా కేకవేశాడు.

ఈ మాటలతో సాధువుకు మరింత భయమై పోయింది. ఈ దుర్మార్గుడు తనను ఒక్క చెవి అయినా ఇచ్చి పొమ్మంటున్నాడనుకుని ఆ సాధువు శరవేగంతో పరిగెత్తుతూ రైతుకు అందకుండా పారిపోయాడు. రైతు నిరాశ చెంది ఇంటికి తిరిగి వచ్చేశాడు. తన యుక్తి పారినందుకు వంటవాడు మటుకు సంతోషించాడు.








# సత్యవాది

అసత్యవాది కథ విని పిల్లలంతా, "నిజం చెప్పటం తేలిక, అబద్ధం చెప్పటమే కష్టం! ఏం, తాతయ్యా?" "అయితే అబద్ధాలు చెప్పిన పిల్లల్ని తిడతా రెందుకు, తాతయ్యా?" "మేం కూడా, ఇకనుంచీ అబద్ధాలు చెప్పమా, తాతయ్యా?" అన్నారు.

తాతయ్య చిన్నగా నవ్వి, పొడుంకాయ తీసి, ఒక పట్టు పీల్చి, చెయ్యి దులుపుకుని, "అబద్ధం చెప్పటం మాత్రం ఏం కష్టమ్రా? నేను కథ చెప్పా లేదు, మీరు వినాలేదు అంటే అది అబద్ధమైపోలా? అసలింకో సంగతి చూశారో లేదో, సత్యవాది కూడా అబద్ధాలు సులువుగానే చెప్పాడు. అతగాడు ఓడిపోయింది అబద్ధాలు చెప్పలేక కాదు–"

తాతయ్య మాట పూర్తి కాకముందే పిల్లలు, "నమ్మించలేక!" అన్నారు.

"ఆఁ! అదీ సంగతి. నిజంలాగా అబద్ధం చెప్పి నమ్మించటం కష్టం. కాని అటు వంటి అబద్ధాల వల్ల ఏమైనా ఉపయోగం ఉంటుందా? రాజుగారికి వినోదం కలిగించటం తప్ప! నిజం చెప్పటం తేలికే నని మీరిప్పుడన్నారే? నిజం కనుక్కోవటం ఎంత కష్టమో మీరెప్పుడన్నా ఆలోచించారా? నిజం దేవుడెరుగు, నీరు పల్ల మెరుగు అని సామెత! అదీగాక నిజం వల్ల ఎంతో ఉపయోగం ఉంది. అందుచేత అసత్యవాది కన్న నిజానికి సత్యవాదే గొప్పవాడు," అన్నాడు తాతయ్య.

"అయితే మరి రాజుగారు సత్యవాదికి తక్కువ జీతం ఎందుకిచ్చాడూ?" అని పిల్లలు అడిగారు.

"ఆ రాజు సరదాకు అబద్ధపు కబుర్లు వినే బాపతు. అతగాడికి నిజం తెలుసుకోగలవాడు అవసరం లేదు. అందుచేతనే సత్యవాది అక్కడ కొలువు చాలించి, ఇంకో రాజు దగ్గిర చేరాడు," అన్నాడు తాతయ్య.



"అక్కడ ఏం జరిగింది, తాతయ్యా ?" అని పిల్లలు అడిగారు.

"తొందరపడతారేం? చెబుతాగా! ఈ కొత్త రాజున్నాడే, ఇతగాడు కూడా మొదట్లో సత్యవాదిని తక్కువ జీతం మీదనే తీసుకున్నాడు. తన తెలివితేటలు చూపించి రాజుగారిని మెప్పించే అవకాశం కోసం సత్యవాది చూస్తున్నాడన్నమాట," అంటూ తాతయ్య కథ సాగించాడు :

ఈ రాజుగారి దగ్గిర ఒక న్యాయాధికారి ఉండేవాడు. ఆయన చెడ్డవాడు కాడుగాని వట్టి చాందసుడు. ఎవరు ఏ ఫిర్యాదు తెచ్చినా సరే, "సాక్ష్యం! సాక్ష్యం!" అనేవాడు. ప్రతి తగాదాలోనూ ఎటు సాక్ష్యం బలంగా ఉంటే అటు తీర్పు చెప్పేసేవాడు. ఎంత పెద్ద తగాదా అయినాసరే క్షణాల మీద తేల్చిపారేసేవాడు. నిజం నిలకడమీద తేలుతుందని సామెత. కాని ఆ న్యాయాధికారి సత్యవాది కాడు, సాక్షివాది.

సత్యవాది కొలువులో చేరాక ఈ న్యాయాధికారి ధోరణిని శ్రద్ధగా గమనించాడు. న్యాయస్థానం ఎల్లప్పుడూ సాక్షులతో కిటకిటలాడుతూ ఉండేది. రోజుకు వంద తగాదాలు పరిష్కారమై పోతూ ఉండేవి. కాని రోజురోజుకూ తగాదాల సంఖ్య పెరిగిపోతూండేగాని తరగటం లేదు. రాజసభలో అందరూ, "ఇటువంటి న్యాయాధికారి మళ్ళీ పుట్టబోడు," అని తెగ మెచ్చుకునేవారు. రాజుగారు అతగాడికి మంచి జీతం ఇస్తూండేవారు. నగరంలో మాత్రం ఎవరి నోట విన్నా, "ఇదేం న్యాయంరా ?" అన్న మాటలే వినపడేవి.

న్యాయాధికారి ఎటువంటి చాందసుడో సత్యవాదికి బాగా తెలిసివచ్చింది. సాక్ష్యం ఉండటానికి అవకాశం లేనిచోట్ల కూడా ఆయన సాక్ష్యాన్ని ఆధారం చేసుకుని తీర్పులిచ్చేవాడు. ఒకసారి ఒకడి ఆవును మరొకడు కాజేశాడు. ఆవు పోగొట్టుకున్న

వాడు ఫిర్యాదు చేశాడు. ఆవును దొంగి లించినవాడు వంద మందిని సాక్ష్యం తెచ్చాడు. వాడు ఆవును దొంగిలించ లేదని వాళ్ళంతా సాక్ష్యం చెప్పేసరికి న్యాయాధి కారి కేసు కొట్టిపారేశాడు! ఆవును దొంగి లించటం చూసేవారుంటారు గాని, దొంగి లించకపోవటాన్ని చూసేవారెవరన్నా ఉంటారా? ఇదంతా చూసిన సత్యవాది రాజుగారి వద్దకు వెళ్ళి, "మహరాజా, మన న్యాయాధికారిగారి తీర్పులు కొన్ని అనుమా నాస్పదంగా ఉంటున్నవని నాకు తోస్తుంది. ఆయనకు నిజాన్ని తెలుసుకునే ఓపికా, శ్రద్ధా ఉన్నట్టు కనబడదు. తవ్వగా తవ్వగా తథ్యం తేలుతుందంటారు పెద్దలు. మన న్యాయాధికారి కేవలం సాక్షులను మాత్రమే నమ్మి, నిజం తెలుసుకోక, అనేక ఫిర్యాదు లలో అన్యాయపు తీర్పు లిస్తున్నారు. ఇది మీ కీర్తికే కళంకం," అన్నాడు.

రాజు ఈ మాటలు విని ఆశ్చర్యపడి, "అయితే ఈసారి న్యాయాధికారి సరిగా నిజం తెలుసుకోలేదని నీకు తోచినప్పుడు నీవే కలుగజేసుకుని న్యాయమైన తీర్పు ఇయ్యి, చూస్తాం," అన్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే ఒక సంఘ టన జరిగింది. రాజుగారు ప్రతి సాయం




కాలమూ తోటకు వెళ్ళి అక్కడ తన మన మలతో కొంతసేపు కాలక్షేపం చేసి ఇంటికి తిరిగి వచ్చేవాడు. ఒకనాడు అదే విధంగా రాజుగారు తోటకు వెళ్ళేసరికి ఆయన మన మలు తోటలో ఆడుకుంటున్నారు.

రాజుగారు వచ్చి పాలరాతి ఆసనంపై కూచోగానే మనమలంతా చుట్టూ వచ్చి కూచున్నారు. అదే సమయానికి తోటమాలి కొన్ని తోట పళ్ళు కడిగి తెచ్చి రాజుగారి ముందు పెట్టి వెళ్ళిపోయాడు. రాజుగారు ఆ పళ్ళు కోసి మనమలకు పెట్టి చీకటి పడేదాకా వాళ్ళతో కబుర్లాడి, వాళ్ళకంటె ముందుగా ఇంటికి తిరిగి వచ్చేశాడు.



రాజుగారు వచ్చిన ఒక అరగంటకు పిల్లలంతా ఇంటికి వచ్చారు. వారిలో ఒకడు ఏడుస్తూ వచ్చాడు. వాడి వేలు తెగి రక్తం కారుతున్నది. కారణం ఏమిటని విచారించగా, చలవరాతి ఆసనం మీద ఏదో ఉండి వేలు కోసుకు పోయిందని తెలిసింది.

రాజుగారు అప్పటికి కుర్రవాడి వేలు కడిగించి, కట్టు కట్టించి, మర్నాడు ఉదయమే ఈ సంగతి న్యాయాధికారికి చెప్పాడు. అంతా విని న్యాయాధికారి, "ఈ తప్పు తోటమాలిదే, సందేహం లేదు. తోట అంతా శుభ్రంగా ఉంచవలసిన బాధ్యత తోటమాలిది. తమరూ, పిల్లలూ కూచున్న ఆసనాన్ని వాడు శుభ్రంగా తుడిచి ఉంచినట్టయితే దానిపై గుచ్చుకునే వస్తువే ఉండ నవసరం లేదు. కనుక తోటమాలి అజాగ్రత్తకు తగిన విధంగా కఠిన శిక్ష విధిస్తాం. వాడి నేరం రుజువయిపోతూనే ఉన్నది," అన్నాడు.

ఈ మాటలు విన్న సత్యవాదికి ఆశ్చర్యం కలిగింది. కుర్రవాడి వేలు తెగటమనే సాక్ష్యం ఆధారంతో తోటమాలి నేరస్తుడని న్యాయాధికారి తేల్చి వేశాడు! విచారణ కూడా లేదు!

"మహారాజా, ఇది విచారణ అనిపించుకోదు. తోటమాలికి శిక్ష విధించే ముందు తోటమాలిని పిలిపించండి," అన్నాడు. విచారణలో జోక్యం కలిగించుకునే అధికారాన్ని సత్యవాదికి ఇచ్చి ఉన్నాడు గనక రాజుగారు తోటమాలిని పిలిపించాడు. సత్యవాది వాణ్ణి ప్రశ్నించి, వాడు రోజూ మూడు సార్లు తోట యావత్తూ శుభ్రం చేస్తాడనీ, కిందటిరోజు రాజుగారు వచ్చేముందే తోటా, తోటలో ఉండే ఆసనాలూ శుభ్రంగా తుడిచాడనీ తెలుసుకున్నాడు.

అప్పుడు సత్యవాది నౌకరును పిలిచి, "నిన్న రాజుగారు కూచున్న ఆసనం మీద ఏదో ఉండి, అబ్బాయిగారి వేలు గాయం

చేసింది. ఆ వస్తువు వెతికి పట్టుకురా!" అన్నాడు. నౌకరు వెళ్ళి ఒక చిన్న బాకు తెచ్చాడు. అది రాజుగారిది. దానితోనే ఆయన కిందటి సాయంత్రం పళ్ళు కోసి, దాన్ని ఆ ఆసనం మీదనే వదిలేశాడు. చీకటిలో కుర్రవాడు దానితోనే వేలు కోసుకున్నాడు.

ఈ విషయాలన్నీ స్పష్టమయాక సత్యవాది రాజుతో, "చూశారా, మహారాజా? సరిగా విచారణ చేస్తే దండించ వలసినది తోటమాలిని కాదనీ, తమరినేననీ తేలి పోయింది. ఇందుకే నిజమాడితే 'నిష్ఠురం' అంటారు పెద్దలు," అన్నాడు.



రాజుగారు సత్యవాది చేసిన పనికి సంతోషించి అతగాడికి న్యాయాధికారితో సమమైన జీతం ఏర్పాటుచేసి, న్యాయస్థానంలో జరిగే కర్మకాండ యావత్తూ చూస్తూ ఉండేలాగు ఉత్తరువు చేశాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాటి సాయంకాలం రాజుగారు ఉద్యానవనానికి వెళ్ళి, ఎప్పటిలాగే తన మనమలతో కాలం గడిపి, చీకటి పడే వేళకు ఇంటికి బయలుదేరాడు. ఆయన ఉద్యానవనం యొక్క ద్వారాన్ని చేరవస్తూండగా అక్కడి కావలివాళ్ళలో ఒకడు రాజుగారిని చూస్తూనే, కత్తి దూసి, "చంపు! చంపు!" అంటూ రాజుగారి తల కేసి విసిరాడు. వాడి కత్తి తగిలి రాజుగారి తలపాగా, తురాయీ కింద పడ్డాయి.

రాజుగారికి మొదట ఆశ్చర్యమూ, తరవాత పట్టరాని ఆగ్రహమూ వచ్చాయి. కాని ఆయన ఏమీ అనకముందే మిగిలిన భటులు ఆ కావలావాణ్ణి పట్టుకుని, పెడరెక్కలు విరిచి కట్టారు.

"ఈ దుర్మార్గుణ్ణి బందిఖానాలో పెట్టండి. వీణ్ణి వెంటనే శిక్షించటానికి ఏర్పాట్లు చేస్తాం," అంటూ రాజుగారు తన ఇంటికి వెళ్ళి న్యాయాధిపతినీ, సత్యవాదినీ పిలిపించి జరిగినదంతా చెప్పాడు. అంతా విని న్యాయాధిపతి, "వాడు రాజద్రోహి, హంత

కుడు. వాడి తల తీసే యిద్దాం," అన్నాడు. సత్యవాదికి కాపలావాడి నేరం రుజువైనట్టు తోచలేదు. వాడు నిజంగా రాజుగారిని హత్య చేయదలిస్తే నలుగురు ఉన్న సమయంలో ఆ ప్రయత్నం చేయడు. అందుచేత సత్యవాది రాజుగారి అనుమతితో కొందరు మనుషులను వెంట బెట్టుకుని కారాగృహానికి వెళ్ళి, అక్కడ ఉన్న కాపలావాడితో మాట్లాడాడు.

వాడు ఏడుస్తూ, "మహారాజుగారిని నేనెందుకు చంపుతానయ్యా? ఆయన తల పాగాలో పాము కనిపించింది. అది రాజుగారిని కాటేస్తుందని భయపడి, మతిపోయి, నా కత్తి దానిపైన విసిరాను. ఇంతకన్న నేనే పాపమూ ఎరగను," అన్నాడు.

సత్యవాది అక్కడినుంచి ఉద్యాన వనానికి వెళ్ళి, రాజుగారి తలపాగా పడిన చోట వెతికాడు. అక్కడ ఆయనకు నిజంగానే చిన్న పాము దొరికింది, అయితే అది నిజమైన పాముకాదు, పిల్లలు ఆడుకునే బొమ్మ పాము. రాజుగారి మనమలు దానితో ఆడుకుని, వేడుకకు రాజుగారి తలపాగాలో, తురాయికి తగిలించారు. ఈ విషయం రాజుగారి మనమల నడిగితే బయటపడింది. సత్యవాది అనుకున్నట్టే అయింది—కాపలావాడు రాజద్రోహి కాకపోగా, రాజభక్తుడని రుజువయింది.

ఇదంతా రాజుగారికి సత్యవాది వివరించి చెప్పాక ఆయన తన న్యాయాధికారి ఎంత తొందర మనిషో, అలాటివాణ్ణి ఆ పదవిలో ఉంచితే ఎలాటి అన్యాయాలు జరుగుతాయో గ్రహించి, అప్పటికప్పుడే సత్యవాదిని న్యాయాధికారిగా నియమించి అతగాడికి మంచి జీతం ఏర్పాటు చేశాడు.

తాతయ్య ఈ కథ చెప్పి, "అందుచేత నేమిటంటే, అబద్ధాలను నిజంగా చెప్పగల వాడికన్న ఎప్పటికన్నా నిజం కనిపెట్టగల వాడే గొప్పవాడు సుమా!" అన్నాడు.





# యుక్తిపరుడు బీర్బల్

## 2

బీర్బల్ తెలివి తేటలను గురించి ఇతర దేశాలలో కూడా గొప్పగా చెప్పుకునేవారు. అతని కీర్తి పర్షియాకు కూడా వ్యాపించింది. అందుచేత పర్షియారాజు బీర్బల్‌ను తన ఆస్థానానికి ఒకసారి పంపవలసిందిగా అక్బరును కోరుతూ కబురు చేశాడు. అక్బరు ఇందుకు సంతోషించి బీర్బల్‌ను సపరివారంగా పర్షియాకు పంపాడు.

బీర్బల్ సభకు రాబోతున్నాడని తెలియగానే అతని తెలివితేటలు పరీక్షించటానికిగాను పర్షియారాజు ఒక ఏర్పాటు చేశాడు. సభికులందరికీ తన దుస్తులలాటివే తొడిగించి, అందరూ కూర్చున్నాక బీర్బల్‌ను సభలోకి ప్రవేశించమని ఉత్తరువు పంపాడు.

సభలోకి అడుగు పెట్టి అందరినీ కలయజూస్తూనే ఇది తనకొక పరీక్ష అని, సభికులలో రాజు ఎవరైనదీ కనుక్కునే బాధ్యత తనపైన ఉన్నదనీ బీర్బల్ గ్రహించాడు. మరుక్షణమే అతనికి రాజెవరైనదీ తెలిసిపోయింది. అతను రాజు కేసి నాలు గడుగులు వేసి, ఆయనకు అంతదూరంలో ఆగి, వంగి సలాము చేశాడు.

పర్షియారాజు బీర్బల్ తెలివితేటలకు ఆశ్చర్యమూ, ఆనందమూకూడా పొంది అతనికి ఘనమైన సన్మానం చేశాడు. తరవాత ఆయన బీర్బల్‌ను, "నన్ను ఎలా పోల్చగలిగావు?" అని అడిగాడు.

"అందరి కళ్ళు తమ మీదే ఉన్నాయి. తమ కళ్ళు ఏ ఒకరిమీదా నిలవక అందరినీ కలయ జూస్తున్నాయి. దానిని బట్టి తమరే సభలో ప్రధాన వ్యక్తి అని సులువుగా పోల్చగలిగాను," అన్నాడు బీర్బల్. పర్షియారాజు బీర్బల్‌కు "బుద్ధి సాగరుడు" అన్న బిరుదు ఇచ్చి గౌరవించాడు.

వి. ఆదినారాయణరావు



ఒకసారి అక్బరు ఆస్థానంలో మనుషులలో గుడ్డివారి శాతం ఎంత ఉంటుందని మీమాంస వచ్చింది. అక్బరు బీర్బల్ అభిప్రాయం అడిగాడు.

"న్యాయంగా చెప్పాలంటే ప్రపంచంలో గుడ్డివారి సంఖ్యా చాలా హెచ్చు," అన్నాడు బీర్బల్.

అక్బరు ఆశ్చర్యపోయి, "ఈ మాట రుజావు చేయగలవా?" అన్నాడు.

"రేపు రుజావు చేస్తాను," అన్నాడు బీర్బల్ వెంటనే.

మర్నాడు బీర్బల్ ఒక మంచపు చట్రమూ, నులక ఉండా తీసుకుని, అక్బరును తన వెంట పెట్టుకుని నది పద్దకు వెళ్ళి, అక్కడ మంచాన్ని దించి, దానికి నులక అల్ల సాగాడు. ఈ వింత ప్రవర్తన చూసి అక్బరు, "ఏమిటి చేస్తున్నావు?" అని ఆశ్చర్యంగా అడిగాడు. బీర్బల్ వెంటనే ఒక కాగితం మీద గుడ్డివాళ్ళ జాబితాలో అక్బరు పేరు మొదట వేశాడు.

క్రమంగా అక్కడికి ఎందరో వచ్చారు. వారిలో, "ఏం చేస్తున్నావు?" అని అడిగిన వారందరినీ గుడ్డివాళ్ళ జాబితాలోనూ, "ఈ మంచం అల్లేది నువు పడుకోవటానికేనా?" అని అడిగిన వారి పేర్లు కళ్ళు గలవారి జాబితాలోనూ చేర్చాడు.

తరవాత ఈ జాబితాలు రెండూ అక్బరుకు చూపించి బీర్బల్, "కళ్ళున్న వారి కంటె గుడ్డివాళ్ళు ఎంత ఎక్కువమంది ఉన్నారో చూడండి," అన్నాడు.

"నన్ను గుడ్డివాళ్ళ జాబితాలో మొదట వేశావేమిటి?" అన్నాడు అక్బరు.

"నేను మంచం అల్లటం చూసి కూడా, ఏమిటి చేస్తున్నావని తమరు అడగలేదా? మిగిలిన వాళ్ళంతా అలా అడిగినవాళ్ళే," అని బీర్బల్ జవాబు చెప్పాడు.

బీర్బల్ నిశిత బుద్ధిని పరీక్షించటానికి అవకాశం దొరికితే అక్బరు పోనిచ్చేవాడు

కాడు. ఒకసారి బీర్బల్ ఎక్కడికో విందుకు వెళ్ళి వచ్చాడు. ఈ సంగతి తెలిసి అక్బరు, "ఏమేం వంటకాలు చేశారు?" అని అడిగాడు.

బీర్బల్ తన ఇష్టం వచ్చినట్టు కోతలు కోసేస్తూ ఒక్కొక్క వంటకాన్నే వర్ణించ సాగాడు. ఒక్కొక్క వర్ణనా పూర్తి కాగానే, "ఆ తరవాత?" అని ప్రశ్నిస్తూ అక్బరు బీర్బల్ చేత బాగా వాగించసాగాడు. ఈ సంభాషణా, విందు వర్ణనా పూర్తి కాక మునుపే ఏదో అవాంతరం వచ్చింది. తరవాత అక్బరు ఆ విషయం మళ్ళీ ప్రస్తావించలేదు.

కాని కొన్ని రోజుల అనంతరం సభలో అక్బరుకు సగంలో నిలిచిపోయిన విందు వర్ణన జ్ఞాపకం వచ్చింది. బీర్బల్‌ను కంగారు పెట్టే ఉద్దేశంలో అక్బరు చటుక్కున అతని కేసి తిరిగి, "ఆ తరవాత ఏమిటి, బీర్బల్?" అని అడిగాడు.

బీర్బల్ తడుముకోకుండా, "ఆ తరవాత కూరే!" అన్నాడు. అక్బర్ ఆనందం పట్ట లేక తన మెడలో ఉన్న ముత్యాలహారం తీసి బీర్బల్‌కు ఇచ్చేశాడు.

సభికులలో ఒక్కరుకూడా అక్బరు సంతోషానికి కారణం ఊహించలేక పోయినారు. బీర్బల్ నోట "కూర" అన్న





మాట రాగానే అక్బరు హారం ఇచ్చేశాడు గనక అక్బరుకు మంచి కూరలంటే అంత ఇష్టం కాబోలనుకున్నారు. అందరూ ఇళ్లకు పోయి శాకాలు పండించి గుండిగలతో రాజభవనానికి పట్టించుకుపోయారు.

అదంతా చూసి అక్బరు రోతపడి, "ఏమిటిదంతా?" అని అడిగాడు.

"తమకు కూర లిష్టమని తెలుసుకుని కానుకగా తెచ్చాం," అన్నాడొక సభికుడు.

వాళ్ళ దురాశకు కారణం అర్థమై అక్బరు మండిపడి, "మీకందరికీ బీర్బల్‌ను చూస్తే ఎందుకింత కడుపుమంట? తెలిసీ తెలియకుండా ఇలాటి వేషాలు వేసినందుకు మీ కందరికీ సంకెళ్ళు వేసి ఖైదు చేసినా పాపం లేదు," అన్నాడు.

సభికులు పాదుషా ముందు సాష్టాంగ పడి క్షమాపణ చెప్పుకున్నారు.

ఒకసారి ఢిల్లీలోని ఒక ప్రముఖ వర్తకుడి ఇంట దొంగతనం జరిగింది. ఆ వర్తకుడు బీర్బల్ వద్దకు వచ్చి వెండి నాణాలతో నిండిన తన సంచీ పోయిందనీ, దాన్ని తన ఇంటి నౌకర్లు ఆరుగురిలో ఎవరో ఒకరు తీసి ఉంటారనీ, అయినా ఆ దొంగను నిర్ణయించటం తన వల్ల కాలేదనీ చెప్పి, అతడి సలహా అడిగాడు.

"మీరు ఇంటికి వెళ్ళి మీ నౌకర్లను ఆరుగురునీ నా వద్దకు పంపండి. దొంగ ఎవరో నిర్ణయించటానికి ప్రయత్నిస్తాను," అన్నాడు బీర్బల్.

వర్తకుడి నౌకర్లు వచ్చేలోపగా ఆయన ఆరు వెదురు కర్రలు ఒకే నిడివి గలవి సిద్ధం చేయించి ఉంచాడు.

వాళ్ళు రాగానే ఆయన, "మీలో ఎవరో మీ యజమాని సొమ్ము కాజేశారట—" అని ప్రారంభించాడు.

నౌకర్లు ఆయన మాట పూర్తి కాక మునుపే, "మేమేమీ ఎరగం! మాకు తెలీదు!" అని కేకలు పెట్టారు.

"మిమ్మల్ని అడిగి కనుక్కునే కర్మ నా కేమిటి? హిమాలయపర్వతాల మీద ఉండే ఒక యోగి నాకు కొన్ని మంత్రించిన కర్ర లిచ్చాడు. వాటి సహాయంతో నేనే దొంగను పట్టుకుంటాను. ఈ కర్రలు తలా ఒకటీ తీసుకుని మా ఇంటనే పడుకోండి. మీలో ఎవడు దొంగ అయితే వాడి కర్ర రేపు పొద్దుటికి బొటనవేలి ప్రమాణం పెరుగుతుంది. దాన్నిబట్టి నాకు దొంగ తెలిసిపోతాడు," అన్నాడు బీర్బల్.

ఆ రాత్రికి నౌకర్లు బీర్బల్ ఇంటనే పడుకున్నారు. వారిలో దొంగతనం చేసిన వాడికి మటుకు నిద్ర పట్టలేదు. తన వద్ద ఉన్న కర్ర పెరుగుతుందనే భయం పట్టుకున్నది. ఆఖరుకు వాడి కొక ఉపాయం తట్టింది. వాడు తన కర్రలో బొటనవేలంత భాగం సరికేసి ఆ తరవాత నిశ్చింతగా పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు తెల్లవారి బీర్బల్ ఆరుగురు నౌకర్లనూ కర్రలతో సహా రప్పించి, "మీ రంతా రాత్రి సుఖంగా నిద్రపోయారు కద! అన్నట్టు నిన్న మీతో ఒక విషయం పొర పాటున తప్పు చెప్పాను. దొంగతనం చేసిన వాడి కర్ర బొటనవేలంత పెరుగుతుం దన్నాను. అది పొరపాటు. కర్ర బొటన వేలంత తరుగుతుంది. మీ కర్ర లన్నీ





ఇవ్వండి. ఎవడి కర్ర తరిగి ఉంటే వాడు దొంగ," అన్నాడు.

బీర్బల్ చేసిన మోసం గ్రహించి, దొంగ తనం చేసినవాడు తప్పు ఒప్పేసుకుని, తాను దొంగిలించిన డబ్బు సంచీ యజమానికి తిరిగి ఇచ్చేశాడు.

అక్బరు ఉన్నట్టుండి అకారణంగా తన రాణీ పట్ల ఉదాసీనంగా ప్రవర్తించసాగాడు. ఆయనకు తన మీద ఎందుకు కోపం వచ్చి నదీ రాణీకి అంతుబట్టలేదు. ఆమె బీర్బల్ సహాయం పొందుదా మనుకున్నది.

బీర్బల్‌కు అంతఃపురంలో ప్రవేశించే అధికారం ఉన్నది. ఆయన తిన్నగా రాణి వద్దకు వెళ్ళి, "నా వల్ల ఏం సహాయం కావాలి, మహారాణీ, ?" అని అడిగాడు.

"పాదుషావారికి నా పైన ఎందుకో అలక వచ్చింది. ఎంతగా బుర్ర బద్దలు కొట్టుకున్నా కారణం కనిపించటంలేదు. కారణం తెలిస్తే క్షమాపణ వేడుకుందును," అన్నది రాణి.

"కోపం వచ్చి ఏమన్నారు ? ఏంచేశారు ?" అని బీర్బల్ అడిగాడు.

"ఏమీ అనరు ! ఏమీ చెయ్యరు ! అదే వచ్చిన చిక్కు," అన్నది రాణి.

"ఆయనకు కోపం వచ్చినట్టు మీకు రుజువేమిటి ?" అని బీర్బల్ అడిగాడు.

"నాకు ఒంట్లో బాగుండటంలేదు. హకీమ్ మందిస్తున్నాడు, తాగుతున్నాను. నాకు ప్రత్యేకమైన వంటకాలు చెయ్యటానికీ, ఉపచారాలు చెయ్యటానికీ నలుగురు దాసీ లున్నారు. ఇదివరకు నాకు ఏమాత్రం ఒంట్లో బాగాలేకపోయినా ఆయన స్వయంగా మందు తెప్పించి, వద్దన్నా తాగించేవారు. నా ఆరోగ్యం గురించి పదేపదే అడిగి కను క్కునేవారు. ఇప్పుడు నాకు జబ్బే లేదనీ, మందులూ, ఉపచారాలూ అనవసరమనీ అంటున్నారు," అన్నది మహారాణి.

ఇది విని బీర్బల్ ఆశ్చర్య పోయాడు. ఎందుకంటే రాణి గర్భవతిగా ఉన్నది.

ఇప్పుడే ఆమెకు కోరిన ఆహారాలూ, ఉప చారాలూ హెచ్చుగా అవసరం.

"విచారించ కండి, మహారాజా. నేను ఈ రహస్యం ఏదో తెలుసుకుంటాను," అన్నాడు బీర్బల్.

ఆ సాయంకాలమే బీర్బల్ అక్బరు వెంట వాహ్యాళికి వెళ్ళాడు. బీర్బల్ మహా రాణీ ఆరోగ్యం ఎలా ఉన్నదని మాట వరసగా అడిగాడు.

అక్బర్ బీర్బల్ కేసి తిరిగి, "కొద్ది రోజుల క్రితం ఒక అద్భుతం చూశాను. ఆ కనిపించే తోపు సమీపంలో నేను షికారు పోతూ ఉండగా తోపులో ఒక మర్రిచెట్టు కింద ఒక భిల్లిని కనబడింది. ఆమె అక్కడ ఏం చేస్తున్నదా అని నేను ఆశ్చర్యపడే లోపుగా ఒక బిడ్డను ప్రసవించి, ఆ బిడ్డను తుడిచి, బుట్టలో పెట్టుకుని, ఏమీ జరగ నట్టే తన దారిన తాను వెళ్ళిపోయింది. దీన్నిబట్టి నేను గుణపాఠం నేర్చుకున్నాను. మనం మన ఆడవాళ్ళను గురించి అతిగా అదుర్దాపడి, వారికి రకరకాల మందులిచ్చి, లేనిపోని హైరాన పడుతున్నాం. నిజానికి ఈ మందులూ, ఉపచారాలూ అన్నీ వట్టి దండుగ!" అన్నాడు.

బీర్బల్‌కు అంతా అర్థమైపోయింది. అతను మర్నాడు ఉదయమే రాణి దర్శనం



చేసుకుని ఆమెకు ఇవ్వవలిసిన సలహా ఇచ్చాడు. అతను వెళ్ళిపోగానే రాణి ఉద్యానవన పాలకుణ్ణి పిలిచి, "ఇవాళ నుంచీ దివాణంలోని పూల మొక్కలకు వేటికీ నీరు పోయించ వద్దు. ఇది నా ఆజ్ఞ," అని చెప్పింది.

"మహారాణీ, మొక్కలు చచ్చిపోతాయే!" అన్నాడు ఉద్యానపాలకుడు.

"చచ్చిపోనీ! పాదుషావారు నిన్నేమైనా అడిగితే నా ఆజ్ఞ అయిందని చెప్పు. నీ కేమీ శిక్ష పడకుండా కాపాడే పూచీ నాదీ!" అన్నది రాణి.

ఒక వారం గడిచాక అక్బరు ధూంధాం అంటూ రాణి వద్దకు వచ్చి, "పూల మొక్కలకు నీరు పొయ్య వద్దని అన్నావుటగదా? నీ ఆజ్ఞ అయిందని చెప్పకపోతే ఈ పాటికి వాడి తల ఎగిరిపోయి ఉండును. ఇలాటి అర్థంలేని ఉత్తరు వెందుకిచ్చావు?" అని ప్రశ్నించాడు.

"దానికి కారణం లేకపోలేదు. కొద్ది రోజుల కిందట నేను అరణ్య ప్రాంతానికి వెళ్ళి అక్కడ ఒక అద్భుతం చూశాను. ఆ అరణ్యంలో ఎంతెంత చెట్లో ఏపుగా పెరిగి, పళ్ళతోనూ, పూలతోనూ విరగ కాసి, విరగ పూసి ఉన్నాయి. నేను విచారించగా ఆ అడవికి తోట మాలీ లేడనీ, ఆ చెట్లకు ఎవరూ నీరే పొయ్యటం లేదనీ తెలిసింది. అలాటప్పుడు మన ఉద్యాన వనానికి ఒక తోట మాలీ, నీరు పొయ్యటమూ దేనికని మానిపించేశాను," అన్నది రాణి.

"అడవి చెట్లకూ, తోట మొక్కలకూ సాపత్యమేమిటి?" అన్నాడు అక్బరు.

"రాణికీ భిల్ల స్త్రీకీ మాత్రమేనా సాపత్యం?" అన్నది రాణి.

"అదా సంగతి? ఇదంతా నీకు నేర్పింది బీర్బల్ కాదూ?" అన్నాడు అక్బరు. ఆయన ఆ రోజు నుంచీ తన రాణికి చేయుదగిన ఉపచారాలన్నీ చేయించాడు.






# పాపన్న చదువు

ఒక ఊళ్ళో పాపన్న అనే కుర్రవాడుండే వాడు. చిన్నతనంలోనే వాడి తండ్రి చని పోగా, తల్లే వాణ్ణి కష్టపడి పెంచింది.

ఒకరికి సహాయపడటమంటే పాపన్నకు ఎంతో ఆనందం. ఇరుగు పొరుగు వాళ్ళకూ, ఎరిగినవాళ్ళకూ, ఎరగనివాళ్ళకూ, దారిలో కనిపించిన వాళ్ళకూ ఏ విధమైన సహాయం కావలిసి వచ్చినా సంతోషంగా చేసేవాడు. ఇతరులకు సహాయం చేస్తున్నప్పుడు వాడికి ఒళ్ళుపై తెలిసేదికాదు, తన సొంత పనులు కూడా మరిచిపోయేవాడు. అందుచేత వాడు గ్రామాని కంతటికీ జీతమూ, బత్తెమూ లేని నౌకరయాడు. వాణ్ణి అందరూ పరోపకారి పాపన్న అని పిలిచేవాళ్ళు.

అస్తమానం అందరికీ ఏదో రకమైన పనులు చేస్తూ ఉండటం వల్ల పాపన్న మంచి పనిమంతుడయాడు. అదీగాక వాడి సహాయం పొందినవారిలో కొంతమంది అయినా వాడి చేతిలో ఒక తినే వస్తువో, రెండు రాగి డబ్బులో పెడుతూండేవారు. (ఇవ్వకపోతే వాడు అడిగేవాడు కాడు, ఇస్తే తీసుకునేవాడు.) ఇదంతా చూసి వాడి తల్లి తన కొడుకు ప్రయోజకుడవుతాడని ఎంతో సంతోషించింది.

కాని రానురాను పాపన్న పరోపకార బుద్ధి గొప్ప అనర్థంగా తయారయింది. వాడు రోజూ నీళ్ళకోసం చెరువుకు వెళ్ళే వాడు. అక్కడ ఏ ముసలిదో, ముసలివాడో, "ఈ బిందె కాస్త సాయంపట్టు, నాయనా," అని అడిగితే, "ఎందుకులెండి. మీ ఇంటికి నేనే పట్టుకొస్తాను," అని తన బిందె అక్కడే వదిలేసి, వాళ్ళ బిందెను వాళ్ళ ఇంటికి చేర్చి మరీ వచ్చేడు.

ఈ ధోరణి చూసి తల్లి పాపన్నతో, "ఎంతసేపూ నువే ఇతరులకు సహాయం చేస్తున్నావు గాని, ఇతరులు కూడా నీకు

సహాయం చెయ్యవద్దురా? తనకు మాలిన ధర్మం ఎక్కడైనా ఉంటుందా? నీ కష్టానికి ఏదో కొంత ప్రతిఫలం లేకపోతే ఎలా, నాయనా?" అన్నది.

"వాళ్ళకే లేకపోతే, పాపం, మన కేమిస్తారమ్మా?" అన్నాడు పాపన్న.

ఒక ఏడు ఉత్థాన ద్వాదశినాడు ఉదయం పాపన్న తల్లి దోసెలూ, పాయసమూ చెయ్యాలనుకున్నది. ఆమె పాపన్నకు డబ్బు లిచ్చి, "పప్పూ, బెల్లమూ, యాలకులూ తీసుకురా," అని పంపింది.

పాపన్న దుకాణానికి పోతుంటే, కందారెడ్డి వీధి అరుగు మీద కూచుని ఉన్నాడు; ఆయన పాపన్నను చూడగానే, "పాపన్నా, కాస్త ఉపకారం చేసి పెట్టాలి. మా పని మనిషి రామి ఇంతవరకూ రాలేదు. కాస్త దాని గుడిసెకు వెళ్ళి, వెంటనే రమ్మంటున్నారని పిలుచుకు రావాలి," అన్నాడు.

ఈ రామి రెండిళ్ళ వాళ్ళకు పాలు పోస్తుంది. ఉదయమే పాలు పితికి ఆ రెండిళ్ళ వాళ్ళకూ ఇచ్చి, కందారెడ్డిగారింట పనికి వెళుతూ ఉంటుంది. కాని ఈ రోజు పాలు పితకటం ఆలస్యమయింది. పాపన్న వచ్చి, "రెడ్డిగారు రమ్మంటున్నారు," అని చెప్పే సమయానికి అప్పుడే పాలు పితకటం పూర్తి చేసింది.



"అవును, నాయనా, ఇవాళ ఆవు మొండి కెత్తటం చేత పాలు పితకటం ఆలస్య మయింది. కాస్త ఈ పాలు వాడుక ఇళ్లకు చేర్చావంటే నేను ఇప్పుడే రెడ్డిగారింటికి బయలుదేరుతాను," అన్నది రామి.

ఇటు రామికీ, అటు కందారెడ్డిగారికీ కూడా ఉపకారం చేసినట్టుంటుందని పాపన్న పాలు తీసుకుని, రామి చెప్పిన రెండిళ్ళకూ అందించి, వస్తుండగా, నెత్తిన పెద్ద మూట పెట్టుకుని రొప్పుతూ, రోజుతూ పురోహితుడు సుబ్బశాస్త్రుల్లు ఎదురయాడు.

"సమయానికి కనపడ్డావు, పాపన్నా. బరువు మొయ్యలేక చస్తున్నాను. కాస్త ఈ మూట మా ఇంటి దాకా చేర్చుదూ, పుణ్యం ఉంటుందీ!" అన్నాడాయన.

"ఇవ్వండి, స్వామీ," అని పాపన్న పురోహితుడి మూటను వారింటిదాకా మోసుకు పోయి, అక్కడి నుంచి అంగడికి వెళ్ళాడు.

అంతకు మునుపే కరణంగారు ఒక మూట బియ్యం అంగడిలో కొని, కూలివాడి కోసం చూస్తున్నాడు. ఆయన పాపన్నను చూడగానె, "నాయనా, పాపన్నా, కూలి వాడు దొరకలేదు, కాస్త ఈ బియ్యం మా యింటికి చేరుస్తావా ఏమిటి? వంట సిద్ధమయి ఉంటుంది. అన్నం తిని మరీ వెళుదువు గాని!" అన్నాడు.



పాపన్న కరణంగా రింటికి బియ్యం చేర్చి అక్కడే భోజనం చేసి, ఆకలి బాధ తీరింది గనక మళ్ళీ పరోపకారం చేస్తూ మూడు ఝాములప్పుడు ఎవరి పని మీదనో తన ఇంటి వేపుగా వచ్చాడు.

తల్లి వాణ్ణి చూసి కేక పెట్టి పిలిచి, "పొద్దుననగా వెళితివి! పప్పూ, బెల్లమూ, యాలకులూ ఏవిరా ?" అన్నది.

"ఇదుగో, ఇప్పుడే వెళ్ళి తెస్తానమ్మా !" అన్నాడు పాపన్న.

"ద్వాదశి ఘడియలు దాటిపోయాక ఇప్పుడు తెచ్చి మాత్రం ఏం లాభం ?" అంటూ తల్లి వాణ్ణి గట్టిగా తిట్టింది.

ఇది జరిగినాక ఆమెకు పాపన్నను గురించి పెద్ద దిగులు పట్టుకున్నది. వాడి పరోపకార ధోరణిని, ఈ విధంగా సాగనిస్తే వాడు ఎందుకూ కొరగాకుండా పోతాడని అనుకుని, ఆమె కాస్త తెలిసిన వారిని సలహా అడిగింది.

"మంచి గురువు దగ్గిర చేర్చి చదువు చెప్పిస్తే పాపన్న బాగుపడిపోతాడు. ఆ పని చెయ్యి," అని పెద్దలు సలహా ఇచ్చారు. కోణంగిపురంలో ఒక గురువు ఉన్నాడు. పాపన్నను ఆయన దగ్గిరికి పంపటానికి తల్లి నిశ్చయించింది. పాపన్న కూడా కొత్త చోటికి వెళ్ళి కొత్త మనుషుల మధ్య తిరగటానికి ఉబలాటపడ్డాడు.

పాపన్నకు పనులు చెయ్యటంలో అమితమైన ఆనందం ఉందని గురువు త్వరలోనే గ్రహించాడు. ఆయన మూడు సంవత్సరాల పాటు పాపన్న చేత అంతులేని చాకిరీ చేయించుకుని, అక్షరజ్ఞానం కలిగించాడు. ఆ పైన, "పరోపకారార్థ మిదం శరీరం," "పరం పరోపకారార్థం యో జీవతి సజీవతి," "ఉపకారః పరోధర్మః" మొదలైన ముక్కలు, వాడికి నచ్చేవి నాలుగు చెప్పి, "నీ చదువయిపోయింది. వెళ్లిరా!" అన్నాడు.

[వచ్చే సంచికలో "రాజ సన్మానం"]






# ఏడాదికొక అబద్ధం

ఒక పెద్ద రైతుకు పనిమంతుడైన పాలెగాడు ఒకడు కావలిసి వచ్చాడు. వాళ్ళ ఊళ్ళోనే ఒక కాపు కుర్రాడు, మంచి పనిమంతుడున్నాడని తెలిసింది. ఆయన కాపును పిలిపించి అడిగాడు.

"బాబూ, మా బుడ్డోడికి తెలియని పని అంటూలేదు. ఇంటి పనికి పెట్టండి, గొడ్ల పనికి పెట్టండి, పొలం పనికి పెట్టండి—అన్నిపనులూ చక్కగా చేసుకుపోతాడు. కాని వాడి కొక్కటే తెగులు—ఏడాదికొక్కసారి అబద్ధం ఆడతాడు. అందుకు సమ్మతమైతే వాణ్ణి పనికి పెట్టుకోండి. నా అభ్యంతరంలేదు," అన్నాడుకాపు.

"ఏడాదికి ఒక్క అబద్ధమే ఆడితే వాడు నిజంగా సత్య హరిశ్చంద్రుడే. రోజుకు పది అబద్ధాలాడని వాడెవడూ ఈ కాలంలో వుండడు," అని రైతు కాపు కొడుకును పనిలోకి తీసుకున్నాడు.

కొత్త పాలెగాడు నిజంగానే మంచి పనిమంతుడు. చాలా చలాకీ. ఇద్దరు ముగ్గురు చేసినంత పని చేసేవాడు. వాడు చేసిన పనికి వంకబెట్టటానికి లేదు. రైతు చాలా తృప్తి పడ్డాడు. వాడి అబద్ధం మాట మరిచిపోయాడు కూడా. ఎందుకంటే ఎన్ని నెలలు గడిచినా వాడి నోట ఒక్క అబద్ధమూ రాలేదు.

సంవత్సరాది వచ్చింది. రైతు తోట ఆ ఏడు విరగ గాసింది. తోటలో పనులు ప్రారంభించే తరుణంలో రైతు ఇంటి వద్ద ఏదో మరిచిపోయి దాని కోసం తన పాలెగాణ్ణి పంపాడు. రైతు ఇల్లు అంతదూరం ఉండనగా వాడు పెద్ద పెట్టున శోకాలు ప్రారంభించాడు. జనం పోగయారు. రైతు భార్య తన పిల్లలతో సహా ఇంట్లో నుంచి బయిటికివచ్చి, "ఏం జరిగిందిరా?" అని ఆత్రంగా అడిగింది.

కె. శివరామయ్య

"అయ్యో, యజమాని! తోట ఇంటి దొడ్డిగోడ!" అని పాలెగాడు మరింత పెద్దగా శోకాలు పెట్టాడు.

"ఏం జరిగిందిరా? గోడ విరిగి ఆయన మీద పడలేదు గదా!" అన్నారు నలుగురూ. వాడు మరింత బావురుమన్నాడు, వాడితో బాటు అందరూ బావురుమన్నారు.

"మీ యజమాని ప్రాణాలతో ఉన్నాడా?" అని అడిగారు వాళ్ళు.

"అప్పుడే అంతా అయిపోయింది," అన్నాడు పాలెగాడు.

ఇంటిల్లి పాతీ శోకాలు పెట్టారు. రైతు భార్య తన గాజులన్నీ పగలగొట్టుకున్నది, జుట్టు పీక్కున్నది; తన ఖరీదైన చీరలు శోకావేశంలో చించేసింది. పిల్లలుకూడా ఏడిచారు. గోడ కింది నుంచి శవాన్ని తియ్యటానికి మనుషులు పలుగులూ, పారలూ తీసుకుని బయలుదేరారు. వారి వెంట రైతు భార్యా, పిల్లలూ కూడా బయలుదేరారు.

వాళ్ళకన్న ముందుగానే పాలెగాడు తోటకు పరిగెత్తుకుపోయాడు. దారిలో వాడు నెత్తి నిండా మట్టి చల్లుకుని, "అయ్యో, అమ్మగారూ! ఇంకెక్కడి అమ్మగారు!" అంటూ పెద్దపెట్టున శోకాలు పెట్టుకుంటూ వెళ్ళాడు. వాణ్ణి చూస్తూనే రైతు కాళ్ళు చల్లబడ్డాయి.



"ఎందుకురా అలా శోకాలు పెట్టి ఏడుస్తున్నావూ? అమ్మగారి కేమయిందిరా?" అన్నాడాయన.

"ఒక్క అమ్మగారేనా? పిల్లలు? అందరి పనీ అయిపోయింది. ఇల్లు విరిగి అందరి మీదా పడింది. వాళ్ళు మన ప్రపంచంలో లేరు! వాళ్ళను చూడలేక పారిపోయి వచ్చాను," అన్నాడు పాలెగాడు మరింతగా శోకాలు పెడుతూ.

రైతు కాళ్ళు గజగజలాడుతూ, పడుతూ లేస్తూ ఇంటి కేసి బయలుదేరాడు. మధ్య దారిలో ఆయనా, ఆయన భార్యా, బిడ్డలూ, ఊళ్ళోవాళ్ళూ కలుసుకున్నారు.

"బతుకు జీవుడా! మీరు బతికే ఉన్నారు గద!" అన్నది రైతు భార్య, భర్తను చూసి తన దుఃఖమంతా మరిచిపోయి.

"మీ మాటేమిటి? మీ శవాలను చూస్తానని అడలిపోతినే! నేను బతికిలేనని ఎవరన్నారూ?" అన్నాడు రైతు.

"ఆ పాలెగాడు వెధవే!" అని భార్య చెప్పింది.

"ఇంకేం? మీరీ ప్రపంచంలో లేరనీ, మీ అందరిమీదా ఇంటి కప్పు విరిగిపడిందనీ వాడే చెప్పాడు," అన్నాడు రైతు.

ఆయన పాలెగాణ్ణి పట్టుకుని, "దొంగ వెధవా, ఎంత అల్లరి తెచ్చిపెట్టావు! చూడు నిన్నేం చేస్తానో!" అన్నాడు కోపావేశంతో.

"నన్ను మీరేమీ చెయ్యటానికి వీల్లేదు. నేను ఏడాది కొక్క అబద్ధం ఆడతానని మా అయ్య ముందే మీకు చెప్పాడు. మీరందుకు ఒప్పుకునే పని యిచ్చారు. అదీగాక నేను ఈసారి సగం అబద్ధమే ఆడాను. కావలిస్తే విచారించండి," అన్నాడు పాలెగాడు.

"ఓరి నీ సగం అబద్ధం చట్టుబండలు గానూ! దాంతోనే ఊరంతా ఒక కొలిక్కి తెస్తివే! పూర్తి అబద్ధంతో ఇంకెంత చేసి ఉండేవాడివో!" అంటూ రైతు పాలెగాణ్ణి పనిలో నుంచి తీసేశాడు.






గుహుడు భరతుడికి సహాయం చేస్తానన్నాడేగాని అతన్ని సందేహం ఇంకా బాధిస్తూనే ఉన్నది. అతను భరతుడితో, "అయ్యా, నీ సేనా, అట్టహాసమూ చూస్తే నాకేదో అనుమానంగా ఉన్నది. నీవు వెళ్ళేది రాముడికి ద్రోహం తలపెట్టి కాదు గద?" అని అడిగాడు.

ఈ మాటకు భరతుడు బాధపడి, "నీకీ అనుమానం కలగటం కన్న పెద్ద కష్టం నాకేమి ఉంటుంది? పెద్ద అన్న అయిన రాముడు నాకు తండ్రితో సమానం కాదా? రాముణ్ణి తీసుకురావటానికే నేను పోతున్నాను. నా మాట నమ్ము," అన్నాడు.

"మంచిమాట అన్నావు, బాబూ. నీలాగా చేతికందిన రాజ్యాన్ని విడిచి పుచ్చేవాళ్ళు ప్రపంచంలో ఎక్కడా ఉండరు. నీ కీర్తి శాశ్వతం," అన్నాడు గుహుడు.

అస్తమయమై చీకటి పడింది. ఆ రాత్రి భరతశత్రుఘ్నులు పడుకుని రాముణ్ణి గురించి చాలా దుఃఖించారు. వారి వెంట ఉన్న గుహుడు వారిని ఓదార్చాడు. అతను లక్ష్మణుణ్ణి గురించి గొప్పగా చెప్పాడు: "రాముడు నిద్రపోతున్నప్పుడు తాను మేలుకునే ఉన్నాడు. మేమందరమూ మేలుకుని ఉండి రాముడికి ఏ భయమూ లేకుండా కాపాడతాను, నిద్రపొమ్మని చెప్పాను. కాని విన్నాడు కాడు. రాముడూ, సీతా కటిక నేలపై పడుకున్నందుకే తన ప్రాణాలు కొట్టుకుపోతూ ఉంటే ఇక నిద్ర ఎలా పడుతుందని అడిగాడు. రాముణ్ణి





చెట్టు కింద పడుకున్న చోటుకూడా చూపాడు. దశరథ మహారాజు పెద్దకొడుకు ఆ చెట్టు కింద దర్భలు పరుచుకుని పడుకోవటం భరతుడు ఊహించనైనా లేక పోయాడు. ఆ రాత్రి గడిచినాక గుహుడు వచ్చి భరతుడికి నమస్కారంచేసి, "రాత్రి సుఖంగా గడిచిందా?" అని అడిగాడు.

"మాకు ఏలోటూ జరగలేదు. మమ్మల్ని త్వరగా నది దాటించే ఏర్పాట్లు చేయించు," అన్నాడు భరతుడు.

గుహుడు అయిదువందల పడవలూ, స్వస్తికా అనే పేరు గల మేలుజాతి ఓడలూ సిద్ధం చేయించాడు. తెల్ల కంబళి పరిచిన ఒక స్వస్తికంలో భరతశత్రుఘ్నులూ, వసిష్ఠుడూ, రాజభార్యలూ ఎక్కారు. భరతుడి సేనా, రథాలూ, బళ్ళూ, వాటినిలాగే జంతువులూ, సంబారాలూ, సమస్తమూ పడవల లోకి ఎక్కించారు. పడవలు నది దాటాయి. ఏనుగులు నదికి అడ్డంగా ఈదాయి. అలాగే కొందరు మనుషులుకూడా ఈదారు. మరి కొందరు తెప్పలమీదా, కుండల సహాయం తోనూ నది దాటారు.

తరవాత భరతుడు ప్రయాగవనానికి సపరివారంగా చేరుకుని, వసిష్ఠాదుల సలహాతో భరద్వాజ మహర్షిని చూడ

వదిలి దశరథుడు ఒక్క రోజు బతుకుతాడా అన్నాడు. పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి మేము మళ్ళీ అయోధ్యకు తిరిగిపోతామా అని చింతించాడు. అదుగో, ఆ మర్రిచెట్టు కిందనే రామలక్ష్మణులు జడలు ధరించారు. తెల్లవారినాక నేను వారి చేత గంగ దాటించాను."

గుహుడు ఈ విధంగా చెప్పుకుపోతూ ఉంటే భరతుడికి దుఃఖం హెచ్చిపోయింది. కౌసల్యా, సుమిత్రా, కైకా కూడా అతనున్న చోటికి వచ్చారు. వారి ఆసక్తి చూసి గుహుడు వారితో రాముణ్ణి గురించి ప్రతి వివరమూ చెప్పాడు. సీతారాములు గార





బయలుదేరాడు. భరద్వాజాశ్రమం కొను దూరంలో ఉండనగానే సైన్యమంతా ఆగి పోయింది. భరతుడు తన ఆయుధాలూ, ఆభరణాలూ తీసివేసి, పట్టుబట్టలు కట్టు కుని, వసిష్ఠుణ్ణీ, మంత్రులనూ వెంటబెట్టు కుని ఆశ్రమానికి వెళ్ళాడు. మంత్రులు ఆశ్రమంలో నిలిచిపోయారు, వసిష్ఠ భర తులు భరద్వాజుడి కుటీరానికి వెళ్ళారు. వారని చూస్తూనే భరద్వాజుడు, "అర్ఘ్యం తీసుకు రండి," అని కేకపెట్టి లేచి నిల బడ్డాడు. భరతుణ్ణి వసిష్ఠుడు పరిచయంచేసి నాక భరద్వాజుడు క్షేమసమాచారాలడిగి, "నాయనా, నీవు రాజ్యంచేసుకోక ఇలా ఎందుకు వచ్చావు?" అన్నాడు. భరతుడు రామలక్ష్మణులకు ద్రోహం తలపెట్టి వచ్చా డన్న అనుమానం ఆయనకుకూడా కలి గింది. భరతు డిందుకు ఎంతో నొచ్చుకుని, గుహుడికి చెప్పినట్టే భరద్వాజుడితో కూడా తన ఉద్దేశం చెప్పాడు. అంతా విని భర ద్వాజుడు సంతోషించి, "సీతారామలక్ష్మ ణులు చిత్రకూటంలో ఉంటున్నారు. ఇవాళ ఇక్కడ ఉండి, రేపు పోదువుగాని," అన్నాడు. ఇందుకు భరతుడు సమ్మతిం చాడు. "నీ సేనలకన్నిటికీ నేను విందు చేయాలనుకుంటున్నాను. వారి నందరినీ



దూరాన ఎందుకు ఉంచి వచ్చావు? ఇక్క డికి వారిని కూడా నీ వెంట తేవలిసింది," అన్నాడు భరద్వాజుడు.

"మహాత్మా, ముని ఆశ్రమాలకు సేనలు దూరంగా తొలగివెళ్ళాలన్న నియమాన్ని బట్టి సేనను దూరంగా ఉంచాను," అని భరతుడు సవినయంగా చెప్పాడు.

"ఫరవాలేదు, నీ సేనను పిలిపించు," అని భరతుడితో చెప్పి భరద్వాజుడు తన అతిథులకు అపూర్వమైన ఆతిథ్యం ఏర్పాటుచేశాడు. విశ్వకర్మ వచ్చి క్షణంలో ఇళ్ళు ఏర్పాటుచేశాడు. నదులన్నీ వచ్చి నీరూ, మైరేయం అనే మద్యమూ సిద్ధం





చేశాయి. దిక్పాలకులు పిలిపించబడ్డారు. పాటలు పాడటానికి విశ్వావసువూ, హాహా, హూహూ అనే గంధర్వులూ, అనేకమంది అప్సరసలూ పిలిపించబడ్డారు. చంద్రుడు వచ్చి చతుర్విధాన్నాలు, పుష్పమాలలూ, పానీయాలూ, మాంసాలూ సిద్ధంచేశాడు.

మయుడు నిర్మించిన అద్భుతమైన భవనాలలో ఒక రాజగృహంలాటిది భరతుడికి ప్రత్యేకించబడింది. అందులో సింహాసనంతో కూడిన రాజసభ ఉన్నది. భరతుడు సింహాసనం మీద కూచోక మంత్రుల ఆసనం పైన కూచుని తన పరివారాన్నీ, గుహుణ్ణీ యథోచితస్థానాలలో కూచోబెట్టాడు.



బ్రహ్మదేవుడూ, కుబేరుడూ, దేవేంద్రుడూ తలా ఒక ఇరవైవేల మంది అప్సరసలనూ పంపారు. భరతుడు కొలువుతీరి ఉండగా నారద తుంబుర గోపులనే గంధర్వ రాజులు గానం చేశారు. అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన అనే అప్సరసలు భరతుడి ముందు నృత్యం చేశారు.

భరద్వాజాశ్రమంలో గల చెట్లూ, పొదలూ, లతలూ స్త్రీ రూపాలు ధరించి భరతుడి సైనికులకు స్నానాలు చేయించాయి; "మీ ఇష్టం వచ్చినట్టు తాగండి, తినండి," అని వారిని హెచ్చరించాయి. సైనికులకు ఏలోటూ లేదు. వారు బాగా తిని, తాగి ఆనందపారవశ్యంలో మైమరచి, "మేము అయోధ్యకూ పోము, దండకారణ్యానికీ పోము, ఇక్కడే ఉంటాము. రాముడూ, భరతుడూ క్షేమంగా ఉంటారు గాక!" అన్నారు. కొందరు, "స్వర్గమంటే ఇదే!" అని కేకలుపెట్టారు. వాళ్ళు పూలమాలలు ధరించి అటూ ఇటూ పరిగెత్తారు, పాటలు పాడారు, నృత్యాలుకూడా చేశారు. రకరకాల మాంసాలతో, పాయసంతో, మజ్జిగ పెరుగులతో దివ్యంగా తయారు చేసిన ఆహారాన్ని ఎంతతిన్నా వారికి తనివి తీరలేదు. ఆ రాత్రి అలా గడిచిపోయింది.





మర్నాడు భరతుడు భరద్వాజుడి దర్శనం చేసుకుని, తమకు జరిగిన ఆతిథ్యానికి కృతజ్ఞత చెప్పుకుని, రాముణ్ణి చేరటానికి మార్గం అడిగాడు. చిత్రకూటానికి వెళ్ళటానికి దక్షిణంగా ఒక మార్గమూ, నైరృతీ దిశగా ఒక మార్గమూ ఉన్నాయనీ, సేనలు నడవటానికి ఏది యోగ్యమో చూసుకుని వెళ్ళమనీ భరద్వాజుడు సలహా ఇచ్చాడు.

దశరథుడి భార్యలు ముగ్గురూ మునికి మొక్కారు. భరతుడు తగిన రీతిగా వారిని మునికి పరిచయం చేశాడు. తన తల్లిని పరిచయం చేసేటప్పుడు అతను పరుషంగా మాట్లాడుతూ, కోపంతో దహించుకు



పోయాడు. అది చూసి భరద్వాజుడు, "రాముడు అడవికి వెళ్ళటం కైకేయి దోషం చేతనని ఒక్కనాటికి అనుకోకు. అందువల్ల ముందు ముందు చాలా లాభం కలుగుతుంది," అన్నాడు.

తరవాత భరతుడు భరద్వాజముని వద్ద యథోచితంగా సెలవు తీసుకుని తన బలగంతో చిత్రకూటానికి బయలుదేరాడు. వారు చివరకు మందాకినీ నదినీ, దానికి దక్షిణంగా ఉన్న చిత్రకూట పర్వతాన్నీ చేరవచ్చారు. రామలక్ష్మణులు ఎక్కడ ఉన్నదీ జాడ తెలుసుకు రమ్మని భరతుడు సైనికులను పంపాడు. కొందరు సైనికులు అడవి ప్రవేశించి ఒకచోట పొగ వస్తూండటం గమనించి ఆ సంగతి భరతుడితో చెప్పారు.

ఆ పొగ వచ్చేచోట ఎవరో ఉన్నారు. అయితే వారు రామలక్ష్మణులు కావాలి. లేదా రామలక్ష్మణుల జాడ ఎరిగిన మునులైనా కావాలి. భరతుడు సేనను నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరించి, సుమంత్రుణ్ణీ, వసిష్ఠుణ్ణీ మాత్రమే వెంట తీసుకుని సైనికులు చెప్పిన దిక్కుగా బయలుదేరాడు.



* * *

రాముడు చిత్రకూటానికి వచ్చి నెల అయింది. ఈ రోజే అతను తన పర్ణశాల







విడిచి సీతతో సహా కొండ మీద విహరించ టానికి బయలుదేరాడు. చిత్రకూటపర్వతం చాలా అందమైనది. అక్కడి చెట్లూ, పక్షులూ, మృగాలూ, చిత్రవిచిత్రమైన ధాతువులూ, పక్కనే ప్రవహించే మందాకినీ నదీ, మనోహరమైన దృశ్యాలూ చూస్తూ వారిద్దరూ చాలాసేపు విహరించారు. రాముడు సీతతో, "నీవూ, లక్ష్మణుడూ నా వెంట ఉంటే ఈ దృశ్యాలు చూసి ఆనందిస్తూ ఎన్ని ఏళ్ళపాటయినా ఇక్కడే ఉండిపోగలను," అన్నాడు.

ఇలా చాలాసేపు విహరించిన పిమ్మట సీతారామలక్ష్మణులు ఒకచోట కూచున్నారు. రాముడు కులాసాగా కబుర్లు చెబుతూ సీత చేత మాంసఖండాలు తినిపించాడు. అదే సమయంలో రాముడికి పరిగెత్తిపోతున్న అడవి ఏనుగులు కనిపించాయి. అవి చేసే అరుపులు వింటే భయపడి పరిగెత్తుతున్నట్టు కనబడ్డాయి. నిజానికవి భరతుడి వెంట ఉండే సేనను చూసి బెదిరినవే. రాముడు లక్ష్మణుడితో, "చూడు, లక్ష్మణా! ఏనుగులూ, ఎనుబోతులూ, సింహాలూ కూడా బెదిరి పారిపోతున్నాయి. ఎవరైనా రాజు వేటాడుతున్నాడా? లేక ఈ అడవి మృగాలను మించిన క్రూరమృగ మేదైనా వచ్చిందా? కారణ మేమిటో చూడు!" అన్నాడు. లక్ష్మణుడు ఎత్తయిన చెట్టెక్కి అన్ని దిక్కులా కలయజూసే సరికి ఉత్తర దిక్కుగా పెద్ద సేన కనబడింది. అతను రాముడితో, "ఏదో పెద్ద సేన మనకేసి వస్తున్నది. అగ్ని చల్లార్చి, సీతను గుహలో దాచి, కవచం తొడిగి, ధనుర్బాణాలు తీసుకో," అన్నాడు.

"సరిగా చూడు, లక్ష్మణా! అది ఎవరి సేనలాగుంది?" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు సేన మధ్య కనిపించే రథాలకు కట్టిన ధ్వజాలను గుర్తించి, "భరతుడు తల్లి ధర్మమా అంటూ రాజ్యాభి



షేకం చేసుకుని, అంతటితో తృప్తిచెందక తన రాజ్యం నిష్కంటకం చేసుకోవటానికై మనని చంపటానికి వస్తున్నాడు. మనం పర్వతం మీద దాక్కుందామా? లేక యుద్ధ సన్నద్ధులమై ఇక్కడే ఉందామా?" అని రాముణ్ణి అడిగాడు.

అతను అంతటితో ఆగక, "ఇప్పుడు భరతుడు మనకు చిక్కబోతున్నాడు. మనకీ కష్టాలన్నీ తెచ్చిపెట్టిన ఈ భరతుణ్ణి తప్పక చంపేస్తాను. అందులో తప్పేమీ లేదు. పైగా భరతుడు చస్తే నీవు షోయిగా రాజువు కావచ్చు. కైకేయినీ, ఆ మంథరనూ, వాళ్ళవాళ్ళ నందరినీ కూడా చంపేస్తాను. అటువంటి పాపులు బతికి ఉండరాదు," అన్నాడు.

ఈ మాటలు విని రాముడు తన తమ్ముణ్ణి మెత్తగా చివాట్లు పెట్టాడు: "తనకుతానై భరతుడు మనను చూడ వస్తూ ఉంటే యుద్ధం చేస్తానంటా వేమిటి? తండ్రి మాట నిలబెట్టటానికి ఇక్కడికి వచ్చినవాణ్ణి, భరతుణ్ణి చంపేసి లోక నిందకు పాలు కమ్మంటావా? కొంచెం నష్టం కలగగానే తండ్రినీ, తమ్ములనూ చంపుకుంటారా? భరతుణ్ణి ఎందుకు శంకిస్తున్నావు? అతను ఎన్నడైనా అనుమానించదగిన మాటలైనా నీతో అన్నాడా? అతను మామగారి ఇంటి నుంచి అయోధ్యకు వచ్చి, మన సంగతి విని మనని తిరిగి తీసుకుపోయే ఉద్దేశంతో వస్తూ ఉంటాడని నా నమ్మకం. నీకు నిజంగా రాజ్యకాంక్ష ఉంటే చెప్పు, భరతుడు రాగానే రాజ్యం నీ కిమ్మంటాను. అతను నా మాట కాదనడు."

ఈ మాటలకు లక్ష్మణుడు సిగ్గు పడి తల వంచుకుని, "మన తండ్రే మనని చూడటానికి వస్తూ ఉండవచ్చు," అని మాట మార్చాడు.

రాముడు లక్ష్మణున్ని చెట్టు దిగి రమ్మన్నాడు. లక్ష్మణుడు దిగి వచ్చాడు.



# 7. ఐఫెల్ టవర్

**1889** లో పారిస్ నగరంలో ఒక గొప్ప ఎగ్జిబిషన్ జరిగింది. ఆ సందర్భంలో ఐఫెల్ అనే ఇంజనీరు ఈ కట్టడాన్ని నిర్మించాడు. దీని ఎత్తు 984 అడుగులు. యూరపులో దీని కన్న ఎత్తయిన కట్టడం లేదు. దీని శిఖరం నుంచి 60 మైళ్ళ దూరం కనిపిస్తుందట.





# ప్రశ్నోత్తరాలు

1. *బందుచోడె ఈశ్వరీనాథ్, విజయవాడ*

సూర్యగోళమునకు చంద్రగోళమువలె గమనము వున్నదా? ఆత్మ ప్రదక్షిణ ఉన్నదా? వుంటే గమన వేగ మెంత?

సౌర కుటుంబ మంతటికి సూర్యుడే కేంద్రం. అన్ని గ్రహాలూ, గ్రహాల చుట్టూ తిరిగే ఉపగ్రహాలూకూడా విధిగా సూర్యుడి చుట్టూ తిరుగుతాయి. అందుచేత చంద్రుడికి గల గమనం వంటి గమనం సూర్యుడికి లేదు. అయితే సూర్యగోళం కూడా ఆత్మ ప్రదక్షిణ చేస్తుంది. సూర్యగోళం ఆత్మ ప్రదక్షిణం చెయ్యటానికి సుమారు 26 రోజులు పట్టుతుంది.

2. కె. యస్. కృష్ణప్రసాధ రావు, విశాఖపట్నం

మనం భూమి మీద వుండి భూమితో పాటు గుండ్రంగా తిరుగుతున్నా మనకు కదిలినట్టు అనిపించదు. ఎందుచేత?

భూమియొక్క భ్రమణ వేగంలో మార్పులూ, హెచ్చు తగ్గులూ లేకపోవటంచేత మనం కదలికను గుర్తించలేకుండా ఉన్నాం. రైలులోగాని, బండిలోగాని పోయేటప్పుడు కుదుపు ఉంటుంది గనక కదలిక తెలుస్తుంది. అదీగాక, రైలులోనూ, బండిలోనూ పోయేటప్పుడు మనకు దగ్గరలో ఉండే ఇళ్లూ, చెట్లూ, పొలాలూ మొదలైనవి వెనక్కు పోవటం కనిపిస్తుంది. భూమితో పాటు పరిభ్రమించే మనకు అత్యంత సన్నిహితంగా ఉన్నది చంద్రుడు; తరవాత సూర్యుడూ, ఇతర గ్రహాలూ; వాటి తరవాత నక్షత్రాలు. ఇవన్నీ అనేక లక్షలా, కోట్ల మైళ్ళ దూరాన ఉన్నాయి.

భూమి వేగాన్ని తెలుసుకోవటమెలా?

భూమికి రెండు రకాల వేగాలున్నాయి. అది తన చుట్టూ తాను తిరుగుతున్నది, సూర్యుడి చుట్టూ తిరుగుతున్నది. భూమి తన చుట్టూ తాను తిరిగేటప్పుడు భూమిపై గల అన్ని ప్రాంతాలూ ఒకే వేగంతో తిరగటం లేదు. భూమధ్యరేఖ మీది చోట్లు హెచ్చు వేగంతో తిరుగుతాయి, ధృవాల దగ్గిరికి వెళ్ళిన కొద్దీ ఈ వేగం తగ్గిపోతుంది. భూమి సూర్యుడి చుట్టూ తిరిగే వేగం (సెకండుకు 18 మైళ్ళు) తెలుసుకోవటానికి భూమికీ సూర్యుడికీ మధ్య ఉండే దూరమూ, భూమి ఒక ప్రదక్షిణం పూర్తి చేసి రావటానికి పట్టేకాలమూ తెలిస్తే చాలు.

3. తిరువీధుల జగన్మోహనరావు, అద్దేపల్లి

మానవుడు అనేక విజ్ఞాన విషయములను తెలిసికొంటున్నాడు గదా, మరి మృత్యువు నుండి తప్పించుకొనగలడా?

జనన మరణాల నుంచి తప్పించుకో గోరేది మోక్షం కోరేవారు. మానవుడు విజ్ఞానం ద్వారా అకాల మృత్యువు నుంచి తప్పించుకుంటూనే ఉన్నాడు. క్రమంగా మానవుడి సగటు ఆయుః ప్రమాణం హెచ్చుతున్నది.

4. ఎస్. పున్నయ్య, రంగూన్ (బర్మా)

ఎడిటరుగారూ! "చందమామ" [మార్చి] లో ప్రచురించిన రంగూన్ పగోడా చిత్రం మీ స్వంతమా? లేక రంగూన్ నుంచి ఎవరైనా పంపించారా?

అది మా ఆర్టిస్టు తయారు చేసినదే.

5. జి. యల్. నర్సయ్య, కోవెలకుంట్ల

"రాకాసిలోయ" 62 తో ముగించకుండ పొడగించేందుకు ఏమైన అవకాశాలు...

చూద్దాం. 62 ఇంకా చాలా నెలలున్నది.

6. ఎస్. సరూప్ నందన్, హైదరాబాదు

అన్నయ్యా, మీరు "చందమామ" లో హస్య కథలు ఎందుకు ఎక్కువగా ప్రచురించరు?

బీర్బల్ కథలూ, కార్టూనూ, తాతయ్య కథా, గుండు భీమన్న కథా, రామతీర్థ కథా— ఇవన్నీ హాస్య కథలేనే.

7. యం. రాజేశ్వరరావు, హన్మకొండ

భానుడు ఉదయించగానే ఎరుపుగానూ, మధ్యాహ్నవేళ తీక్షమైన వేడిగానూ, అస్తమించువేళ మరల ఎరుపుగాను యుండుటకు కారణమేమిటి?

సూర్యోదయ, అస్తమయ వేళలలో సూర్య కిరణాలు భూమి చుట్టూ ఉండేగాలి పొరలో హెచ్చు దూరం ప్రయాణిస్తాయి (బొమ్మ వేసి చూస్తే సులువుగా తెలుస్తుంది.) ఆ సమయాలలో గాలి పొరను గడిచి ఎరుపు రంగు కిరణాలు మాత్రమే మనని చేరగలుగుతాయి. మిగిలినవి గాలి పొరలలో చెదిరిపోతాయి. అందుచేత సూర్య బింబం ఉదయాస్తమయాలలో ఎర్రగానూ, కాంతి హీనంగానూ ఉన్నట్టు కనబడుతుంది. మధ్యాహ్నవేళ సూర్యుడి కిరణాలు వేడిగా ఉండటానికి కారణం, అన్ని రంగుల కిరణాలూ భూమిని చేరుతాయనేది అలా ఉండగా అవి సూటిగా వచ్చిన దారినే ప్రతి ఫలితం కావటంచేత ఎండ వేడి రెట్టింపవుతుంది.

Photo by J. V. Sivarama Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

కులాసా కోసం

పంపినవారు:
డి. వసుంధరాదేవి, హైదరాబాదు

Photo by P. Krishna Kumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

కళా విలాసం

పంపినవారు :
డి. వసుంధరాదేవి, హైదరాబాదు

# ఇద్దరు భార్యల భర్త ★

[ రామతీర్థ కథ ]

ఒక ధనవంతుడికి ఇద్దరు భార్య లుండే వారు. పెద్ద భార్య పై అంతస్తులో ఉండేది, చిన్నభార్య కింది అంతస్తులో ఉండేది.

ఈ భాగ్యవంతుడి ఇంట దొంగతనం చెయ్యటానికి ఒక దొంగ ప్రయత్నించి పట్టుబడ్డాడు. ఆ దొంగను పోలీసులు తీసుకుపోయి మేజిస్ట్రేటు ఎదట పెట్టారు. దొంగ ఏమీ దొంగిలించకపోయి నప్పటికీ దొంగతనం చేయ యత్నించానని ఒప్పుకున్నాడు.

"అందుకే నిన్ను శిక్షించవలసి ఉంటుంది," అన్నాడు మేజిస్ట్రేటు.

"అయ్యా, నాకు ఏ శిక్ష అయినా విధించండి గాని ఇద్దరు పెళ్ళాలను చేసుకోమని మాత్రం తీర్పు ఇవ్వకండి," అని దొంగ ప్రాధేయపడ్డాడు.

మేజిస్ట్రేటు ఆశ్చర్యపడి, "అదేమిటి?" అని అడిగాడు.

"అయ్యా, నేను ఎలా పట్టుపడ్డాననుకున్నారు? అందరూ నిద్రపోయి ఉంటారనుకుని నేను ఆ ధనికుడి ఇంట్లోకి ప్రవేశించే సరికి ఇంటి యజమాని మెట్ల మీద నిలబడి ఉన్నాడు, ఒక భార్య ఆయనను పైకి లాగుతున్నది, ఇంకొక భార్య కిందికి లాగుతున్నది. ఏ ఒకరూ ఆయనను వదలరు. ఈ బాధ పగవాడికి కూడా వద్దు!" అన్నాడు దొంగ.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1962 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కులాసా కోసం

రెండవ ఫోటో: కళా విలాసం

పంపినవారు: డి. వసుంధరాదేవి,

ఎర్రమంజిల్ కాలనీ, హైదరాబాదు.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

గాంధారి పుత్రశోకంతో కుమిలిపోతూ, ధర్మరాజు కనిపించగానే శపించాలని నిశ్చయించుకున్నది. వ్యాసుడు ఈ సంగతి గ్రహించి ఆమె వద్దకు వెళ్ళి, "ధర్మరాజుపై కక్ష పెట్టుకోకు. నీ కొడుకు యుద్ధానికి వెళ్ళేటప్పుడు, ధర్మం ఉన్నచోటనే జయమూ వుంటుందన్నావు గదా. ధర్మం పాండవుల పక్షాన ఉండటంచేతనే వారు జయించారనుకో!" అని హితం చెప్పాడు.

"నాకు పాండవులు నశించాలన్న కోరికలేదు, కాని పుత్రశోకం నన్ను వివశురాలిని చేసింది. దుర్యోధన దుశ్శాసనులూ, శకుని కర్ణులూ చేసిన తప్పువల్ల కురుక్షయం జరిగింది. అందుకు నేను ఎవరినీ నిందించను. కాని గదా యుద్ధంలో ఎంతో సమర్థుడైన నా దుర్యోధనుణ్ణి భీముడు బొడ్డు కిందుగా కొట్టటం నేను సహించలేకుండా ఉన్నాను," అన్నది.

ఈ మాటలు విన్న భీముడు గాంధారితో, "అమ్మా, నా ప్రాణాలు నేను కాపాడుకున్నానే తప్ప నేను ధర్మాధర్మాలు పాటించలేదు. నీ కొడుకును నేను ధర్మయుద్ధంలో చంపలేదు. నన్ను క్షమించు. అంతకుముందు నీ కొడుకు అధర్మంగా మా అన్నను జయించాడు, అష్టకష్టాలూ పెట్టాడు. ద్రౌపదిని పరాభవించాడు. నీకు తెలుసు గదా!" అన్నాడు.

గాంధారి భీముడితో, "ఈ అధర్మం నీవు చేయవలసినది కాదు. దుశ్శాసనుడి రక్తం తాగావే, అది అనార్యులు చేసేపని గదా!" అన్నది. "అమ్మా, నా ప్రతిజ్ఞ తీర్చుకునేటందుకు అతని రక్తంతో నోరు తడుపుకున్నాను గాని గుటక వెయ్యలేదు. రక్తం తాగటమే నా ఉద్దేశమైతే కర్ణుడి రక్తం తాగకపోయానా?" అన్నాడు భీముడు.

"ధర్మరా జెక్కడ?" అని గాంధారి అడిగింది. ధర్మరాజు వణికిపోతూ, "నీ కొడుకులందరినీ హత్యచేసిన ధర్మరాజును ఇక్కడే ఉన్నాను," అన్నాడు. గాంధారి కళ్ళకు కట్టుకున్న గంత కింది నుంచి ధర్మరాజు గోళ్ళు కనిపించాయి. వాటిపై ఆమె చూపు పడగానే అవి కమిలిపోయాయి. గాంధారి యుద్ధరంగంలో తన కొడుకుల శవాలు చూసి ఎంతో దుఃఖించి, కోపం పట్టలేక కృష్ణుణ్ణి, "మీ యాదవవంశం కూడా ఇలాగే నీ కళ్ళ ఎదుట నాశనం కావాలి!" అని శపించింది.

తరవాత ధర్మరాజు విరిగిపోయిన రథాలూ, కట్టెలూ చితులు పేర్పించి ముఖ్యులైన యోధులకు దహనసంస్కారం చేయించాడు. మిగిలినవారి దహనక్రియ ఒకే చితిపై విదురుడు చేయించాడు.

అనంతరం అందరూ గంగకు వెళ్ళి చనిపోయినవారికి జలతర్పణాలు వదిలేటప్పుడు కుంతి పాండవులతో, తాను కన్యగా ఉండగానే దూర్వాసుడు తన కొక మంత్రం చెప్పటమూ, అది పఠించి ఆమె సూర్యుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, "నీ వంటి కొడుకును ప్రసాదించు," అని కోరటమూ, దాని ఫలితంగా ఆమెకు కర్ణుడు పుట్టటమూ మొదలైన కథ అంతా చెప్పి, "కర్ణుడు మీ పెద్ద అన్న. అతనికి కూడా తర్పణాలు విడవండి," అన్నది. ఈ సంగతి విని ధర్మరాజు దుఃఖంతో కుంగిపోయాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



బాల ప్రపంచంలో ఎల్లప్పుడూ
వినిపించే మాట న్యూట్రిన్




న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్,
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.



మీ
శిరోజాలు
అంత మనో
హరంగావుండ
వలెనని మీ కోరిక!

ఇటు తిరిగి ఒక్క-
చూపు — మీ రెప్పలార్చ
మరచినవి, కారణం!
ఒత్తుగా మెరయుచుండే మనోహర
మైన ఆమె శిరోజాలు —
అప్పుడు మీ శిరోజాలు అంత
మనోహరంగా వున్నవని
తెలియు చుండుటచేత మీ
హృదయం ఉల్లాసంతో
ఉప్పొంగదా! అధిక
గుణవంతమైన పదార్థా
లతో గూడియున్న
ప్రశంసనీయ పరిమళం
గల 'కేష' మనోహర
మైన శిరోజాలు ఒత్తుగా
పెరుగునట్లుచేసి మీ
శిరోజాలకు కొత్త
చక్కదనము గలిగిం
చును — మీరు అశించే
కొత్త చక్కదనము!

మీ కేశ పోషణ పథకము
నేడే ప్రారంభించండి

రోమ గృహమునుండి
మరియొక శ్రేష్ఠమైన ఉత్పత్తి




సోల్ ఏజెంట్లు:
ఎమ్. ఎమ్. ఖంభట్ వాలా, అహమదాబాద్
ఏజెంట్లు:
పి. నరోత్తమ్ అండ్ కో., బొంబాయి - 2

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-00 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-50 పంపండి. ప్రతి ఒక్కంటికి 12 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



చందమామ పబ్లికేషన్సు

వడపళని. :: మదరాసు - 26


ఆరోగ్య మైన పాప
మోహన్, కమలలకు పాప పుట్టాడు


మంత్రసాని వారికొక మంచి సలహా యిచ్చింది
అజీర్తి రోగాలు, శూల వ్యాధులు రాకుండా మీ పాపను కాపాడండి ....


MANNERS
GRIPE MIXTURE
ప్రతిరోజూ- రోజుకు రెండు సార్లు పాపకు మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ యివ్వండి


మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ పాపకు బాగా రుచిస్తుంది
పాప ఎంత చురుకుగాను, ఉత్సాహంగాను వున్నాడు చూడు.


పది మాసాల తర్వాత
పాలపళ్ల రోజుల్లో కూడా పాపను ఆరోగ్యంగాను, ఉత్సాహంగాను వుంచుతుంది మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్





"గుండమ్మ కథ"లో
తుది సీను

హాస్య శృంగార రసప్రధానమైన వాస్తవిక
కుటుంబ గాథ



విజయా వారి

# గుండమ్మ కథ

డైరెక్షన్... కె. కామేశ్వరరావు, బి.ఏ

నిర్మాతలు.... **నాగిరెడ్డి & చక్రపాణి**



